# పీఠిక

ఆరోగ్యార్థ మొనరించిన భాస్కరస్తుతి యగుట నిది యారోగ్యభాస్కరమని యనంబడియెను. 122 పద్యములతోఁ గూడిన యొక యల్పగ్రంథము గాని యెక్కువ కాదు. ఈపద్యములైనను సర్వసంస్తవయోగ్యములైనవి స్వల్పము. ఒక్క నా వ్యక్తికే సంబంధించినవి చాల. ఇట్టి చిట్టిపొత్తమునకుఁ బీఠికకూడ వ్రాయుట యనవసరము. పైపెచ్చు హాస్యాస్పదము. గ్రంథరచనాకారణము మొదటనైన పద్యములందే వివరింపఁబడియున్నవి. నా యనారోగ్యము ప్రకృతము చాలవఱకుఁ గలిగిన పునరారోగ్యము భాస్కరప్రసాదమూలమగుటయే దీనిరచనకు ముఖ్యకారణము. అట్టి ప్రసాదరావుగారియెడలఁ జూపవలసిన కృతజ్ఞత యంతయు గ్రంథమందే చూపియుండియుఁ దనివిచాలక మఱికొంత మిత్త్రలేఖల ద్వారమునఁగూడఁ జూపఁదలఁచితిని. నా యనారోగ్యమునకుఁ బరితపించియుఁ దగు సాయమొనర్చియు నున్న మిత్త్రులయెడలఁ గూడఁ గృతజ్ఞుఁడనగుటకును దన్మిత్త్రలేఖలుమాత్త్ర మిందుఁ గొన్ని ప్రకటించుచున్నవాఁడను. ఇదియే దీనికి నాపీఠిక. అందు ముందు కథానాయకునిలేఖయే ప్రకటీక్రియమాణము.

—♦ మిత్త్రలేఖలు ♦—

అమలాపురము, తూ॥ గో॥ అంగిరస్సం॥ జ్యేష్ఠ బ ౧౧ 28-6-1932

మీ రనారోగ్యముగా నుండుచున్నట్లును వ్యాధి మిమ్ములను చాలరోజుల నుండి పీడించుచున్నట్లును నింతవఱకు... యెఱుఁగనట్లును నభినవసరస్వతి తెలుపుచున్నది. ఆషాఢ శు॥ మొదలుకొని గోదావరీపుష్కరప్రారంభమగును. పుష్కరము పేరుచెప్పియైనను నొకసారి యిటకు సకుటుంబముగా వచ్చి యొక పక్షమైన నాయొద్దనుండి మీరోగమున కనుకూలమగు మందు సేవించఁగలందులకుఁ గోరుచున్నాను. ఇటులొనర్చినఁ దీర్థము స్వార్థముఁ గలసివచ్చును. మీవంటివారి కాతిథ్యమిచ్చుట కన్నోదకములకుఁ గొదవలేదు. మీరు మిత్త్రులు బంధువులు గురువులు నగుటచే మాయింటి నింత ప్రసాదము పడయుటకు నేను గోరకుండనే మీకు వాక్కు కలదు కావున వెంటనే బయలుదేరి వచ్చి నాకోరికను దీర్చి మీరు నిరామయులగుదురుగాకయని కోరుచున్నాను... రాక కెదురుచూచుచుందును ... రాజమండ్రినుండి స్టీమరుమీఁద బొబ్బర్లంక వచ్చి యటఁగా నెక్కిన మా గుమ్మములో నిలుచును... ప్రసాదరావు.

త్రిలింగ కార్యాలయము ... మద్రాస్

అయ్యా! శ్రీముఖ సం॥ ఆషాఢ శు ౬ (29-6-33)

నమస్కారములు ... ఈమధ్య జబ్బుచేసినందునఁ బత్త్రిక నిలిచినందుకు విచారపడుచున్నాను. త్వరలో నారోగ్యముకలిగి యింకను గొంతకాలము సారస్వతసేవ చేయుదురని యెంచుచున్నాను ...

వావిళ్ళ వెంకటేశ్వరులు.

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.
శ్రీముఖ సం॥ ఆషాఢ బ 3 (10-9-33)

... బహుప్రణామపూర్వము విధేయుఁడు చతుర్వేది అమరేశ్వరుఁ డొనర్చు విన్నపములు. ప్రకృతము ... ఏతన్ముద్రాక్షరశాలయందు మేనేజరుగా నొకింత కఠిన సరణి వ్రాయవలసివచ్చుటచే నన్ను మన్నింతురుగాక ... ఎట్టివిపత్ప్రవాహములు నిరోధించినను దాటఁజాలి యిరువదియాఱుసంవత్సరములనుండి యాంధ్రదేశమం దెల్లెడల వ్యాప్తమై మీ యభినవసరస్వతి యిట్టి మతవిప్లవసమయమున నిలిచిపోవుట సనాతనధర్మావలంబుల దౌర్భాగ్యమనక తప్పదు ... మొదట మీ యారోగ్యస్థితి దెలుపుచుఁ బత్రికా నిర్వహణవిషయమై వ్రాయుఁడు. కాలపరిస్థితినిబట్టి ముద్రాక్షరశాలల నిర్వహించు టెంతయు నాయాసకరముగానున్నది కాన మీరీయవలసిన పైకమును జరూరుగాఁ బంపఁ బ్రార్థితులు ... ఇంతకంటె హెచ్చుగా వ్రాసి దీర్ఘవ్యాధిజర్జరితమైన మీ హృదయమును నొప్పింపఁజాల.

నూజవీడు

ఆర్యా! శ్రీముఖ సం॥ ఆషాఢ బ ౮ (11-7-33)

మీ దేహారోగ్యము చక్కఁగా లేదని తెలిసి మాకందఱికిఁ జాలకష్టమాయెను. మీ మిత్రవైద్యసహాయముచేఁ ద్వరలో నారోగ్యము కలుగునని భగవంతుని బ్రార్థించుచున్నాను.

ఇః యే నమస్కారములు
చేబ్రోలు రాజగోపాలరావు.

గుంటూరు
శ్రీముఖ సం॥ ఆషాఢ బ ౯ (12-7-33)

... అంతటంతటఁ బ్రసాదరావుగారియొక్కయు మీయొక్కయు క్షేమము వ్రాయఁ బ్రార్థింతును. మీ కిప్పట్టున శ్రీవారి వైద్యమే సర్వథా శ్రేయస్కరము. కొంతేమి వ్యవస్థ పట్టినను బునరారోగ్యమున కింతకన్న శరణములేదు. ఆరోగ్యమును గల్గితీరును. మీ యుపాస్యమాన దైవము మిమ్ముఁ దోసిపుచ్చఁడు. నేనును యథాశక్తి నాయిష్టదైవమును మీనిమిత్తమై ధ్యానించుచుందును.

శా॥ మిత్రేందుప్రభృతిగ్రహంబులకు నీమేరన్ నివేదించి స
న్మైత్రీవల్లభునిం బ్రసాదభిషజున్ మన్నించి యానాఁడు సౌ
మిత్రిన్ శీఘ్రము యుద్ధరించినటులీ మేదిన్యమర్త్యాగ్రణిన్
మిత్రున్ బాంధవు బాలసంతతికి సామీరీ! కృపం బ్రోవుమా.

...శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

కొల్లాపురము.
శ్రీముఖసం॥ శ్రావణ బ 3 (8-8-33)

...వందనసహస్రంబులిచ్చి శిష్యపరమాణువు లిఖించుచున్నది... ఇంకను మీ దేహారోగ్యము పూర్తిగ లేదని యారోగ్యభాస్కరపద్యములే సాక్ష్యమిచ్చుచున్నవి. పద్యములు హృద్యములుగ నున్నను దద్భావములఁ జూడ గుండె నీరైనది... ఆరోగ్యభాస్కరపద్యములు మఱికొన్ని పంపుదురని ప్రార్థన... రామసుబ్బారాయుఁడు.

జానపాడు

శ్రీముఖ సం॥ శ్రావణ బ౧౧ (16-8-1933)

నమస్కారములు... మీ శరీర మింకను పూర్ణారోగ్యము చెందనందుకు వగచుచున్నాను... మీ శరీరారోగ్యమును గుఱించి యెల్లప్పుడు భగవంతుని ప్రార్థించుచు జవాబు కెదురుచూచుచున్నాను.

జానపాటి లక్ష్మీనారాయణ.

జానపాడు

శ్రీముఖ సం॥ శ్రావణ బ౧౨ (18-8-33)

నమస్కారములు... మీ యింటిఖర్చులు వగైరాలకు మీ రేమాత్రము విచారపడవద్దు. మీ రింటికిఁ జేరువఱకు నెంతఖర్చైనను నా మొగా రడిగినవెంటనే యిచ్చుచుండఁగలను. ఇదివఱకుఁగూడ నా ప్రకారమే యిచ్చుచుంటిని. మీ శరీరవ్యాధి పూర్తిగా నెమ్మదించువఱకు నక్కడనే యుండఁగోరెద... మీ స్థితినిగుఱించి మీ యింటిలోఁబడు విచారము వ్రాయ శక్యము కాదు. మీ శరీరారోగ్యము కలుగుటకు మీ యుత్తరమునకు నెదురుచూచుచు భగవంతుని ప్రార్థించుచున్నది. ఈమధ్య మీ జవాబు ఆలస్యమైనందున మీకు, టెల్లిగ్రామీయవలెనని తహతహపడినది. ప్రసాదరావుగారు మీయందుఁజూపిన యాదరణకు మేమందఱము సంతోషించుచుంటిమి ...మీ యింటి యోగక్షేమము ప్రతిదినము విచారించుచుంటిని.

జానపాటి పురుషోత్తము.

జానపాడు

శ్రీముఖ సం॥ శ్రావణ బ౧౫ (21-8-33)

బ్ర॥ ... పట్టాభిరామశాస్త్రి మామగారి సముఖమునకు ... నమస్కారములు ... డాక్టరుగారు మీకు స్వజనులే కనుక మీ రేమాత్రము మ[illegible]గ్యపడవలసిన పనిలేదు. ఇప్పట్టున మీరు వ్రాసినప్రకారము 'మిత్ర మాపత్సు జానీయాత్' తను వాక్యము డాక్టరుగారియందే కనుపించుచున్నది. మీ యింటి కేగి యక్కడనే కూర్చుండి యీ యుత్తరము వ్రాయుచున్నాను ... మీరు నాకు వ్రాసినలేఖలోని సంగతులన్నియు ల॥ కమలమ్మకు వినిపించినాను ... కంటివెంట నీరువిడిచినది ... పిల్లలుఁ దాను మీముఖప్రదర్శనమునకు సదా నిరీక్షించుచున్నామని నొక్కి వ్రాయుమన్నది ... పురుషోత్తము ... మీకష్టములకు మిక్కిలి విచారపడినాఁడు ... మీరు వ్రాసినపద్యములు సులభశైలిని బాగుగానే యున్నవి ... ఆనందించితిని ... మీ యింటిసంగతులు తప్పక యప్పుడప్పుడు కనుగొనుచుండెదను. మీ రధైర్యపడవద్దు. పిల్లలుఁ దల్లి క్షేమముగానున్నారు ... మీభార్య ... మీవిషయమై చింతిల్లుచున్నను శక్తిగలదిగనుకఁ బైకిఁ గనఁబడనీకుండ ధైర్యముతోనే యున్నది. మీరును బెంగపెట్టుకొనవద్దు ...

జానపాటి విశ్వనాథము.

... శ్రీరస్తు. ఆరోగ్యమస్తు. దీర్ఘాయుష్యమస్తు ... మీకు సంపూర్ణారోగ్య మింకను లభించనందుకు విచారముగానున్నది ... ఆరోగ్యము తప్పక కలుగును.

బెజవాడ

గ్రహించవలెను.

శ్రీముఖ సం॥ భాద్రపద శు ౬ (26-8-33) మల్లాది రామకృష్ణ విద్వచ్ఛాయస

చంద్రికాముద్రాశాల, గుంటూరు
శ్రీముఖ సం॥ భాద్రపద బ ౨ (6-9-1933)

...మీ రారోగ్యభాస్కరములోని పద్యముల నుల్లేఖించుచు వ్రాసిన ... కార్డు చేరి సంగతులు విశదమైనవి. ఇంతకాలము మీ రిట్లు జాడ్యగ్రస్తులగుట ప్రవాసము నుండుట విత్తవసతిలేక చిక్కుపడుట పత్రిక నిలిచిపోవుట ఋణబాధ కలుఁగుట మున్నగు మీ ప్రకృతస్థితి పర్యాలోచింపఁగా ‘నీచైర్గచ్ఛ త్యుపరిచ దశా చక్రనేమిక్రమేణ’ యను కాళిదాసోక్తి జ్ఞప్తికి దగులుచున్నది. గ్రహానుకూల్య మెప్పుడేర్పడునో యప్పుడ సమస్తము నప్రయత్నముగఁ జక్కఁబడఁగలదు గాన మీబోటి విజ్ఞులు ‘భవితవ్యం భవత్యేవ’ యను నిశ్చయమున నిట్టియిక్కట్టుల సహించి తదర్థమై నిరీక్షింతురే కాని యెప్పట్టునను నైరాశ్యము నొందరు. పత్రికాపునఃప్రకటనసందర్భమున మీరు సంపూర్ణారోగ్యము చూచుకొననిది యారంభించిన మీ కింకను నాయాసము కలుగు నేమో యని నా భయము. పత్రికలఁ బడసియుఁ దమంతఁ దాము చందా పంపునలవాటు లేని చందాదారులవలనఁ బ్రతిఫలము వడయుటలో నింకను బ్రయాసము గలుగు నేమో యని భయమగుచున్నది. ఎట్లయినను మీ యుత్సాహము పట్టుదల ప్రశంసనీయములు. బ్ర॥ శంకరముగారును మీ యుత్తరము చూచి యనుతపించిరి. వారును నార్థికముగ మిక్కిలి చిక్కులలో నున్నారు...లోఁగడబాకీ తీర్మానము కాకయే మరల ముద్రించి యిచ్చుటెట్లా యని వెనుకాడుచున్నారు. అయినను మీరు క్రొత్తసంచిక ముద్రించి యిచ్చినతోడనే పైక మందఁజేయుదురేని మ్యాటరు పంపునట్లు వ్రాయుఁడనిరి. కాన మ్యాటరు సిద్ధముగ నున్నచోఁ బంపుఁడు... అమరేశ్వరుఁడు.

కొల్లాపురము
శ్రీముఖసం॥ భాద్రపద బ౧౧ (15-9-33)

...మీ లేఖ చేరినది. అందలి విషయంబు లన్నియు విషాదకరంబులౌటచే నా మనం బెంతయుఁ బరితపించినది. నా యర్థాంగలక్ష్మియును దుఃఖించినది...ప్రసాదరావుగారు సర్వవిధముల మిమ్ముఁ గనిపెట్టుట ప్రశంసాపాత్రము...ప్రసాదరాయనివంటి యుత్తముఁడు...దొరకఁడని నా నమ్మిక. అందుచేతనే రావుగారికి

తే॥ కపట మెఱుఁగని నీవంటి ఘనసఖుండు
ఒక్కఁ డున్నను జాలఁడొకో జగాన?
కష్టకాలములందు నక్కఱకు రాని
బంధుజన మెంతయున్న నిష్ఫలముగాదె.

అని యొకలేఖగూడ వ్రాసితి...వ్రాయఁబూనిన గ్రంథ మగును...ఒక్క మాటలో నా యాశయము వెల్లడించి ముగించెదను. లోకములో మిత్రప్రశంసఁ బ్రసాదరావుగారి పేరు సర్వజనులును వాడుకొందురుగాక. వారి యశస్సౌరభ మాంధ్రదేశోద్యానవనవాటికల వ్యాపించుఁగాక. వారికిఁ జిరాయురారోగ్యసంపత్తి ప్రసాదించి భగవానుఁడు సంరక్షించుఁగాత. రామసుబ్బారాయఁడు.

సూర్యభగవానుఁడా! భాస్కరాయని వేయివిధముల నిన్ను స్తుతించుచుండె మాగురున కారోగ్యముకలుగఁజేయకుండుట నీకు న్యాయముగాదు. ఈకవితాజపము చాలదా? లోకోపకారమునకై పాటుపడు మహనీయుఁడు. సనాతనధర్మతత్పరుఁడు. ఉభయభాషాప్రవీణుఁడు. దురాశఁబూని భోగభాగ్యముల కాశించెనా? ఆరోగ్యపదార్థమొకటే కోరుచున్నాఁడు. అది నీకరుణాకటాక్షశ్రీలచే లభ్యమగును. నీవే శరణమని నిన్నే నిత్యముఁ గొల్చుచు నారోగ్యభాస్కరము వ్రాయుచున్నాఁడు. ఆరోగ్యభాస్కరసారము.

ఉ॥ కోడలు దూఁక నాదుమది గోరుటలేదు. బజారులందు బల్
ప్రోడనటంచుఁ బర్వులిడఁ బోయి చరించెడువాంఛ లేదు. రో
చేడెలఁగూడి యాడుటకుఁ జిత్తమునందుఁ దలంపులేదు. నా
ఈడున కర్హమైన బల మిచ్చినఁ జాలును నాకు భాస్కరా!

అను నొక్కపద్యపద్యమునం దిమిడియుండెను. మిత్రుఁడగు ప్రసాదరావు గారికైనను మాటదక్కించవాయని శాస్త్రిగారు

చ॥ వెలగలమందు లూరకయు వేళ కొసంగుచుకాక స్వీయమా
నిలయమునందె నిల్చుకొని నేఁటికి మాసయుగంబునుండి ని
ర్మలుఁడు ప్రసాదరావు తన మంచిని వెల్లడిచేయుచుండె. ఆ
వలఁతి సదుద్యమంబు ఫలవంతముఁ జేయఁగదయ్య భాస్కరా!

అని ప్రార్థించుచుండిరి.

శ్లో॥ పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమసురార్చనైః

అని సురార్చనమే కడపటి సాధనముగాఁ బ్రాక్కవులును వాడియున్నారు. కార్యమును సాధించియున్నారు. దైవతారాధన వ్యర్థముగాదు.

—♦ ఆరోగ్యరాఘవము ♦—

పరమేశ్వరా !

కవికులకోటికి దుర్భర దుస్సహదారిద్ర్యమొకండు వరముగ నిచ్చితివి. పోనీ. సాహిత్యలక్ష్మీసంపన్నులమని దారిద్ర్యబాధ సరకుగొనక యెట్లో జీవితమును ధర్మనిష్ఠితబుద్ధిచే నెట్టుచుండ సారస్వతసేవయును జేయుటకు వీలులేని రోగమును శరీరమున కెక్కించితివా? నాగురుని బాధించుట పాడిగాదు. కుయోయొంటో యనుచున్నను వినవా? సీతాపతీ! వీరు నా పరమగురువులు. నా కవితాసంఘము నుద్ధరింప బద్ధకంకణులు. వీరి కవితానైపుణ్యము కొనియాడఁదగినది.

సీ॥ స్కాందస్థ నాగరఖండ మంతయును దె
నుగించి పూర్తిగఁ బ్రకటించినాఁడ.

అని వీరు వ్రాసిన పద్యపాదమునుబట్టి వీరి యుభయభాషాప్రావీణ్య మెట్టిదో తెలియందగు. అభినవసరస్వతీ పత్రికాధిపతులై యిరువదియైదు సం॥ లనుంచి నిర్వ

ఘ్నముగాఁ బత్రిక సాగించుచుఁ గ్లిష్టసమయములలో శాస్త్రిగారెట్టి శ్రద్ధవహించిరో యట్టిది సామాన్యులకు శక్యమగునో కాదో రఘురామా! నీవెఱుఁగుదువా?

సీ॥ లంకణంబులు చేసి లలిఁ బాసినప్పుడైన
వెల్లడింపక దీని విడువ లేదు.
ఏడేండ్లసుతుఁ డీల్గి యేఁడుచునప్పుడైన
పరిచరింప కిద్దానిఁ బాయలేదు.
సంతానసృష్టికై చింతించునప్పుడైన
ఊళ్ళ కియ్యది పంపకుండ లేదు
ప్రథమకళత్రంబు పడిపోయినప్పుడైన
వెలయింప కిద్దాని నిలుపలేదు.
వ్యాజ్యములు వచ్చి పైఁబడినప్పుడైన
మాసమాసంబుఁ బ్రకటింప మానలేదు.
సంధ్యతోపాటు దీనిని సంత్యజింప
కీడ్చుకొనివచ్చుచున్నాఁడ నింతవఱకు

అను వీరి పద్యమునుజూడుము. అట్టిప్రతిజ్ఞను బట్టి పత్రికను నడిపించు పట్టాభిరామునకా యిట్టిదుర్గతి? పట్టాభిరామా! నీనామమును ధరించినవాని నిట్లు కష్టపెట్టుదువా? వారి ప్రవర్తన మెట్లుండునో వారు రచించిన

సీ॥ కవితయు విద్వత్త గలదు నాకడఁగాని
చెలఁగి యేగడబిడఁ జేయఁజాల.
శుద్ధవైదికవృత్తిఁ జూపట్టుదునుగాని
వేషభాషలు పెక్కు వేయఁజాల.
ఉన్నంతకార్యంబె విన్నవింతునుగాని
కలవి లేనివి యేవొ పలుకఁజాల.
గ్రక్కున నౌరుల డగ్గఱఁ దలంకుదుఁగాని
నిర్భీతి నటఁ జేరి నిలువఁజాల.
ప్రకృతకాలపరిస్థితుల్ బాగుగా నె
ఱుంగనట్టి యమాయికపుంగవుఁడను.... ...

అనుపద్యము సాక్ష్యమిచ్చును. భద్రాద్రిరామా! ఇట్టినాగురువర్యుఁ గష్టపెట్టుట ధర్మమగునా? వారి యనారోగ్యమునకై తపింపనివారెవ్వరు? వారి నెఱిఁగిన ప్రతిమానవుండును దుదకు శత్రువులౌకవో నున్నను వారుగూడ విచారింపక మానరని నా నమ్మకము. రామా! ఇంతమంది వారి యారోగ్యమునకయి ప్రార్థించుచుండ నెందటిని జిన్నపుచ్చుట ధర్మముకాదు. వారిపిల్లలు పిల్లలే. ఇతరసాహాయ్య మేమి

యును లేదు. అయ్యో! ఒక్కొక్క పద్యము వారి యారోగ్యభాస్కరమందుఁ దిల కించిన గుండె నీఱగుచున్నది. కడుపు బ్రద్దలగుచున్నది. బాష్పధారలు ప్రవహించుచున్నవి. చూడు.

శా॥ కాలుం జేయియు నాడునంతవఱకే కల్యాణిఁ బోషింతు నం
చాలోచింపక పత్రికావిషయమం దన్నాఁడ ము న్నేను. నా
కేలే యాడెడిఁగాని కాలి కకటా! కీడ్పాటు వాటిల్లె. ఇం
కేలా పత్రికనడ్పుదున్? ప్రతిన యింకెట్లేలుదున్ భాస్కరా.

శా॥ కాలున్ నీవు కుదుర్పకున్న నిఁక నేఁ గావించు కార్యంబెదే
దీలోకంబున. పత్రికన్ మఱియు నాయిల్లాలినిం బిల్లలన్
పాలింపంగ నశక్తుఁడన్ సరి కదా! నాకడ్పె నేఁబూటప్పుకోఁ
జాలన్. జోలియు దారికేని వలదే సంచారమో భాస్కరా.

శా॥ కించిద్దూరపుటూళ్ళలో వలి సుహృద్గేహంబు లిం కంతకున్
కించిద్దూరపు గ్రామబాహ్యములకే కృచ్ఛ్రంబుగా నుండ నా
సంచారంబెటు దూరదూరములకున్ సౌఖ్యంబుగా సాగు? ఈ
కొంచెంపున్ స్థితికన్ననున్ మృతియే మేల్ కొంచెంబిఁకన్ భాస్కరా.

ఈరీతిని బ్రతిజ్ఞచేసి జీవితముకన్న ధర్మభాషాసేవయే ముఖ్యమని పాటుపడుచుండు నట్టిమహాకవివాక్కునుండి యిట్టి దీనమగుమాటలను వెడలఁజేయఁదగునా? దాశరథీ! ఈసమయమున నీసహాయము లేకున్నఁ బరసహాయమెంతయున్నను నిష్ప్రయోజనమే. నీవు నాయిలువేల్పైనకతాన నిన్ను నమ్మి నాగురున కారోగ్యమిమ్మని యారోగ్యరాఘవమను నీచిన్నికృతిని లిఖియించితిని. నాగురుఁడు వ్రాయుచున్న గ్రంథమునకన్న నిది ఘనమాయని శంకింపకుము. ఆగురునిమార్గమునే త్రొక్కఁదలఁచితి. గురునియందుఁగల భక్తితాత్పర్యములే నన్నిట్లు ప్రేరేపించినవి. గురున కారోగ్యమిమ్మనికోరుట తప్పా? శిష్యధర్మము నెఱవేర్చుకొనుట తప్పా? నేనట్టిసాయముఁజేయలేకున్నను నాభక్తివెల్లడించు పద్యములను గానుకగాఁ బంపుకొన్నాఁడను.

చ॥ జలజలరాలె బాష్పకణజాలము లేఖను జూచినంతఁ గ
న్నెలఁకులనుండి. దుఃఖమునకున్ గుఱియయ్యె భవచ్చరిత్రయుం
చలవిలపించినాఁడ మనమందున. సత్కవులైన మీరు మీ
కలమును బూని దైన్యమును గ్రక్కుచు వ్రాయుటచోద్యమయ్యెడిన్.

ఉ॥ దైవము దాఁటరాద నెడు తత్త్వమెఱింగిన జ్ఞానులౌటచే
ఈవిధి దుఃఖభారమున నెంతయు మీపరిశుద్ధభావమున్
పావనమైనచిత్తమును బాడొనరింపఁగనేల? కష్టముల్
జీవితమందు దాఁక నివసించునె? సౌఖ్యము గల్గకుండునే?

ఉ॥ కావున ధైర్యమూనుఁడు, సుఖంబు బలంబు లభించు మీకు. ఇం
కేని భయంకష్టములు నెన్నఁడుఁ గన్పడఁబోవు. సౌఖ్యమే
జీవితమందుఁ గన్పడు. ప్రసిద్ధికినెక్కిన పత్రికావిభుల్
కేవల మాపరాత్పరుని లీలలఁ జక్కఁబడున్ గుణోత్తమా!

ఉ॥ దేనికినైన నేమి పరదేవత సత్కృప చిక్కినంతటన్
గాని కృతార్థతం బడయఁగా ననుకూలము గాదు. మీరిటుల్
మానసమం దధైర్యమును మాటికిమాటికిఁ దాల్పనేల? ప్ర
జ్ఞానిధులైన మీకిల నసాధ్యములెయ్యవి చెప్పుమా గుణా!

శా॥ మీకన్నం గడుఁ జిన్నవాఁడనగుటన్ మీకిట్లు బోధింపఁగా
నాకుం జెల్లునె? బుద్ధిపాటవమునైనం గాంచఁగానైతి. మీ
కేకార్యంబునకైన సాయపడఁగా నీనాకు శక్యంబొకో?
శ్రీకాంతుండె సమర్థుఁ డన్నిగతులం జింతించి రక్షింపఁగన్

రామచంద్రా! నీకాళ్ళంబడి ప్రార్థించుచున్నాఁడ. నాప్రార్థన ఫలవంతమగు
నట్లు చేయుము. నాగురునికి సంపూర్ణాయురారోగ్యశ్రీలను బ్రసాదింపుము.

శా॥ శ్రీరమ్యంబుగఁ బత్రికావిషయముల్ చేకూర్చి పోషింపవే
ప్రారంభించినదాది విఘ్నమెపుడున్ వాటిల్లఁగానీక త్వ
మారోగ్యం బిడి యున్నఁ జాలుననుచుం బ్రార్థించుచున్నార లా
ప్రారంభమ్మును సాఁగఁజేయు మిలలోఁ బట్టాభిరామప్రభూ!

...మొదట రు 5 లు పంపితిని....తక్కిన రు 5 లు పంపితిని....నేను విశేషించి సాయముచేయఁజాలనందులకును నింతస్వల్పము రెండుసారులు పంపినందులకును సిగ్గుపడుచున్నాను. నాకెన్నిచిక్కులున్నను బరమేశ్వరుఁ డిట్టిసందర్భములలోఁ గొంచెమో గొప్పయో మిత్రధర్మము నెఱవేర్చుకొనుభాగ్య మిచ్చినఁ జాలునని ప్రార్థించుచున్నాఁడను...

రామసుబ్బారాయుఁడు బి. యే.
కడియము. తూ॥ గో॥ డి॥

18-9-38 శ్రీముఖసం॥ భాద్రపద బ ౧౪

...మీ భాస్కరమకుటపుఁ బద్యములు త్రిలింగలోఁ జదివి యానందించినాను. ...ప్రసాదరావుగారి యభిప్రాయము ననుసరించియే ప్రవర్తింపుఁడు ... జాతకవిషయమును బరిశీలించికొనుఁడు. భాస్కరారాధన మానకుఁడు...

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.
కొల్లాపురము

శ్రీముఖ సం॥ ఆశ్వయుజ బ ౧౩ (17-10-38.)

...ఆరోగ్యభాస్కరము ప్రచురించుచుంటిరి. కనుక నానిమిత్తమై 50 ప్రతులెక్కువగా నుంచవలెను. అందుకగు పేపరు బైండింగుచార్జీలు నాపైనఁ గట్టవచ్చును.

విధేయుఁడు, రామసుబ్బారాయుఁడు బి. యే.

---

చేటపఱ్ఱు. ఏలూరుతాలూకా - ప॥ గో॥ డి॥
శ్రీముఖ సం॥ కార్తిక శు౭- 21-10-1933.

కం॥ పట్టాభిరామశాస్త్రీ! పెట్టకు తడి కంట. తనదు వేయికరములన్
పెట్టనికోటగ నిడి నీ కెట్టివిపత్తులను జేరనీ కినుఁ డోముల్.

తే॥ కలి సనాతనధర్మరక్షణముకొఱకు
పాటుపడునట్టి భూసురవరుఁడవౌట
తా సనాతనుఁడౌటను దరణి నీకు
మిత్రిముఖరూపముల నీక మేలొసఁగఁడె?

తే॥ సామయుండైన పట్టాభిరామశాస్త్రి
కవి తపశ్శాలి సుగుణుండు ఘనయశుండు.
నీప్రసాదాన కర్హుఁడు. నేఁ డతనికి
ఆయురారోగ్యముల నిడు మంబ! దుర్గ!

గుండు శేషయ్య.

— తమరుపంపిన కవరు చేరినది. తమకుఁ దిరిగి యారోగ్యము పూర్తిగాఁ జెడుట
యాపరేషన్ జరుగుట మొదలగు విషయములు చూచి మిక్కిలి దుఃఖించితిని.

ఆరోగ్యభాస్కరప్రభావము.

ఉ॥ వచ్చినలేఖఁజూచి గురువర్యునకున్ సుఖమబ్బెనంచు లో
హెచ్చుగ సంతసంబును వహించితి నెమ్మనమందు. భాస్కరున్
నిచ్చలు భక్తిభావములు నిండ భజించినదానికిన్ ఫలం
బచ్చుపడంగ నయ్యె. పరమాత్ముని సేవలు వ్యర్థమౌనొకో.

ఉ॥ పట్టినపట్టువీడ కల భాస్కరునిన్ భజియించినందుకే
పట్టున సౌఖ్యమబ్బె. కనుపట్టె శుభంబులు. దేహదార్ఢ్యమున్
నెట్టనఁ గల్గె. ఔషధము నేర్పుగ నిచ్చెఁ బ్రసాదరావు. ఇం
కెట్టివి భాగ్యసంపదలు కేర్పడు మీకుఁ జిరాయురున్నతిన్.

మ॥ కననయ్యెంగద మీా మనోద్రఢిమయుఁ. కన్పట్టె వాక్సిద్ధియుఁ.
కనఁగానయ్యె భవత్ప్రభావబలముఁ సౌఖ్యప్రదుండైన సూ
ర్యుని నిండారుమనంబునం గొలువ నారోగ్యంబు చేకూరెఁ. గా
వున నీమార్గముఁ బట్టువారి కిలలోఁ బొల్పారు సౌఖ్యోన్నతుల్.

రామసుబ్బారాయుఁడు.

ఇవి ముఖ్యమైనమిత్రలేఖలు. వీనితోడనే పీఠిక సమాప్తి.

---

# విజ్ఞాపనము.



ఈయారోగ్యభాస్కరమున నశ్లీల (అర్థవిషయకగ్రామ్య)దోష మున్నదని నే నెఱుంగుదును. కాని యనేకౌషధములు సేవించియు నా రోగ్యము పడయఁజాలక తుదకు మొదలిడిన స్తుతియగుట నుద్రేకము తో నున్న బాధయంతయు విన్నవించుకొనఁబడినది. ఒరులు విన్న నప హసింతురని యున్నవిధముఁ జెప్పకొనక యూరకున్న వైద్యునకుఁ దెలి యు టెట్లు? మఱియు చికిత్సఁ జేయు టెట్లు? ఏవైద్యులును గుదుర్పలేని పదబాధను బడపడి భాస్కరుఁడే ప్రశమింపఁజేసెఁ గావున నాపాలిటి కాయనయే వైద్యరాజు. అట్టివాని కఖిలమును దాఁచక మొఱపెట్టు కొంటిని. తథ్య మెఱిఁగించుపట్ల ధర్మశాస్త్రములును నిఘంటువులుం బోతె నేను నీపథముఁ ద్రొక్కితి. సత్కవులు క్షమింతురుగాక.

విధేయుఁడు, జానపాటి పట్టాభిరామశాస్త్రి.



గ్రంథకర్త,
జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అష్టావధాని,
జానపాడు, పల్నాడు తాలూకా.

శ్రీ సూర్యనారాయణపరబ్రహ్మణేనమః.

# ఆరోగ్యభాస్కరము



ఉ॥ శ్రీపతి నీదు మండలము చేరి వసింపఁ ద్రియాతనుండవై
రేపులు మాపులున్ ద్విజులు ప్రీతి నొసంగు జలాంజలుల్ కరం
బోపికతోడఁ గొంచు మఱి యూరకయుండక వారి బాధలన్
పాపుచునుండు నీదు పదపద్మములన్ శిరముంతు భాస్కరా! ౧

ఉ॥ ఈక్షితి విష్ణువంచు మఱి యీశ్వరుఁడంచు నిఁకేమొయంచు సం
రక్షణగోరి పెక్కురును రాళులు రప్పలు గొల్చుచుంద్రు. ప్ర
త్యక్షముగా విభాసిలెడి దైవమ వన్నను నీవకాక యీ
రూక్షశిలాదు లెట్లగు? గురుత్వ మిఁకెందుల కందు భాస్కరా! ౨

ఉ॥ లక్షలయోజనంబుల జ్వలత్ప్రళయానలుఁబోలి వెల్గు చే
కాక్షరథంబుమీఁద ననిలాశువునం జను నుష్ణరశ్మి నిన్
చక్షువునెత్తి చూచుటక శక్యముకాదనికాని యెన్నఁ బ్ర
త్యక్షపుదైవమున్ విషయమందున సంశయమున్నె భాస్కరా! 3

ఉ॥ ఈక్షణఁజేయఁ ద్వన్మహిమ మింకను నెంతయొ యుండియుండెఁ. ప్ర
త్యక్షత యొండెకాదు. నియతంబుగ నీ యుదయంబ కానిచో
అక్షయకాళరాత్రియగు నంతయు ధ్వాంతము పర్వెడిన్. జగ
చ్చక్షువు వహస్కరుండవు త్విషాంపతి వారయ నీవు భాస్కరా! ౪

ఉ॥ ఏలబహూక్తు. లాత్మ యొకఁడేయయియుండిన లోకమంతకున్
చాలిన మేలుచేయుటకుఁ జాలనటంచని ద్వాదశాత్మవై
గ్రాలుచునుంటి. వందునన కాదె సురోత్తమ లోకబాంధవా
ఖ్యాలలితుండవై యశముగాంచితి. వెంచితి వింక భాస్కరా! ౫

చం॥ జగముసకంతకున్ జగము సర్వమునుం గనుపింపఁజేయఁగన్
తగినప్రదీపమై సతముఁ దజ్జగతీప్రజ సల్పుకర్జముల్
గగనచరుండవై సరిగఁ గన్గొనుచుండుటఁ గర్మసాక్షియం
చాఁగి నుతింపఁగాఁబడుచునుండవె యింకను నీవు భాస్కరా! ౬

చం॥ అదితికిఁ గశ్యపర్షికిని నాత్మజుఁడై జనియించి ఛాయయన్
మదవతిఁ బెండ్లియాడి యమునన్ యము నాబిడయందుఁ గాంచియా
నది భువి శుద్ధిఁజేయఁగను నందను బాపుల శిక్షఁజేయఁగన్
సదయతఁ బంపియున్న నిను సంస్తుతిసేయఁ దరంబె భాస్కరా! ౭

చం॥ జనులఁ బునీతులం జలుపఁజాలు సరిత్తున కన్న లోకపా
వను నినుఁ జూచుకొంచు ననివార్యతమై నపవిత్రపుం బనుల్
పొనరుచుచుండఁగావలసె. పూర్వికు లిందుక యట్టిచోఁ ద్వదా
ద్యనఘపవిత్రదర్శన మనాచరణీయ మటండ్రు భాస్కరా! ౮

ఉ॥ యత్నము లేక కట్టెదుట నగ్నిభవజ్జలముఖ్య పావన
పవిత్రపదార్థము ల్పడు. అపావన మూత్రవిసర్జనాదులన్
యత్నపురస్సరంబుగన యాదెసఁ గన్గొనకుండ నుండనౌ.
నూత్న లెటుండినన్ బుధజను ల్పొనరించెద రట్ల భాస్కరా!

ఉ॥ ఎవ్వ రెటు ల్పొనర్చినను నేరికిఁగావలె నాపరిసక్తి? నా
నెవ్వగ నాకుఁజాలు. నిను నేను బ్రమత్తత నప్పుడప్పు డా
దవ్వులఁ జూతు నప్పనుల. తాదృగఘక్రియ లింకఁజేతు. నీ
వవ్వి మదిన్ స్మరింపక క్షమింపవలెం గృపతోడ భాస్కరా! ౧౦

ఉ॥ తాదృగమేధ్యపుం గ్రియలఁ ద్వన్ముఖ మేధ్యులఁ జూడకుండనే
ఏదొవిధిం బొనర్చినను నింక నమేధ్యత మేందిరియాళికిన్
త్వాదృగయాభిముఖ్య మది తప్ప నెతప్పు. దవార్యమాటఁ ద
త్తాదృశకార్య మెన్నడును దప్పనఁబోలదు కాదె భాస్కరా! ౧౧

చం॥ ఎవరెదియాచరించినను నీవు కనుంగొనకుండ నుండమిన్
భువిని జనించుటాదిగను బుద్ధివిహీనత నేను జేసియు
న్న వృజినము ల్తలంచుకొనినన్ భయమయ్యెడి. నీకు నాస్థితిన్
వివరముగా నిఁ కెవ్విధము విన్నపముం బొనరింతు భాస్కరా!

చం॥ శతమొ సహస్రమో మఱి యసంఖ్యము లేనొ యొనర్చియుందు ద
ష్కృతములు నేను. బుద్ధి యటు లీడ్చుటఁజేసి కృతంబు లవ్వి. త
ద్గతమును గూర్చి చింతిలినఁ గార్యము లేదు. త్వదంఘ్రియుగ్మమే
గతి యిఁక. అస్మదుద్ధరణకార్యభరంబది నీద భాస్కరా! ౧౩

ఉ॥ గ్రాసముఁగూర్చి నీ కభిముఖంబుగ నిల్చి మహాగ్రహంబుమై
భాసయొనర్చితిన్. సతులపట్లను నట్ల పొనర్చియుంటి. ఈ
చేసినబాస తప్పితిని. చిత్తము నాఁగఁగ లేకపోయితిన్.
దాసరితప్పు లన్నియును దండముతో సరిపెట్టు భాస్కరా! ౧౪

ఉ॥ ఇట్టివి పెక్కులున్నయవి. ఏనును నీవును దప్పు నన్యులీ
గుట్టునెఱుంగ. నేటికిఁగ గూఢపుఁ జెయ్యుల బైటఁబెట్టుకొం.
పెట్టెరు కూడఁ జెప్పికొన రీ నవగోప్యము. లిట్టికట్టులన్
దట్టులు చేసియుండరె ఘనంబుగఁ బూర్వమునందు భాస్కరా!

ఉ॥ త్వత్తనుజాతయా యమున తాఁజని గంగను గూడుచోటనే
బత్తి మునింగివచ్చితిని. పాపముఁబాపరె యాపె యాపె? ఈ
సత్తలులేవె వారికి? ప్రసన్నముఖాబ్జలు కాకయున్నచో
ఇత్తతినేని నీవు వచియించి యటు ల్పొనరింపు భాస్కరా! ౧౬

చం॥ యమునయు గంగ రెండు నొకచోనెడ స్నాతుల పాతకంబు పూ
ర్వమువలె నున్నఁ బ్రేఁబలుకు వమ్మయిపోయెసి.అవ్వ యాత్మదే
హమయిన నీవు వానిని యథార్థముఁజేయుభరంబు పూనకే
క్రమమునన్నో వసించు టది కార్యముగామి స్మరింపు భాస్కరా!

ఉ॥ ధాత్రి సమస్తబుద్ధులకుఁ దప్పక ప్రేరకుఁ డీవయంచు గా
యత్రి వచించుచున్నయది. అందున మామకబుద్ధి యిట్లిహా
ముత్రవిగర్హ్యపుం బనులు పూనఁగఁ బ్రేరణసేయుచుంట నీ
మిత్రతయందలోపమును మిక్కిలి బాతెఱుఁగాదె భాస్కరా!

ఉ॥ సంధ్యల నర్ఘ్యము ల్విడిచి సంస్తుతిఁజేయుచునుంటి నిన్ను. మో
హాంధ్యముమై నొనర్చుకొల యెప్పటి దప్పడ యాఁగకుండినన్
వంధ్యతవాటిలున్ శ్రుతికి. వాస్తవ. మింకను నేను దుర్గతిన్
బంధ్యుఁడనౌచు నుండెదనొ పాత్రుఁడనౌదునొ చెప్పు భాస్కరా!

ఉ॥ మత్కృతకల్మషంబు లతిమాత్రములై మతి దేనఁగూడ నీ
మత్కృపభావముం బొరయఁజాలమి దుర్గతి తప్పకుండినన్
త్వత్కృప తప్పఁజేయునది. త్వత్సుతుఁడేకద నారకంబునన్
మత్కృణమట్లు పాపులను మాడ్చుచునుండెడివాఁడు భాస్కరా!

ఉ॥ ఆరయ ధర్మరాజు భవదాత్మజుఁ డస్మనుదంతమంత వే
శ్వేఱుగ నచ్చుఁ జెప్పి నరవిక్ క్షమియింపఁగఁ జేయుమయ్య. ఈ
నారకభీతి న న్వీడిచినట్ మఱియొక్కటి విన్నవించుకో
పేరెము లెత్తుచున్నయది పేశల మామక వాక్కు భాస్కరా! ౨౧

ఉ॥ ఏఁబదితొమ్మిదబ్దముల యీ డిపు డెన్నఁగ నా. కిఁ కెన్ని యేం
డ్లే బ్రదుకంగఁ గల్గినది యింతయెఱుంగ. చిరాయువీయఁగన్
తాఁ బలు వంబుజాసనుఁడు. తద్విధి మన్వినయంత కాల మో
హో! బలహీనతన్ నవయకుండు బె కావలె నాకు భాస్కరా!

ఉ॥ భాగ్యము భోగ్యమున్ మిగుల భాసిలవంచను చింత లేదు. నన్
యోగ్యుఁడటంచుఁ గొంద అనుచుండిరి. అంతియచాలుఁ గానిహో!
మృగ్యమును మ్మనామయము. మేను రుజాభరితమ్ము. కాన నా
రోగ్యమొసంగుదాతవని రూఢిగ నిన్ భజియింతు భాస్కరా!

ఉ॥ ఒక్క భవత్కళేబరము యుద్ధురరోగయుతంబు గా. దిలన్
పెక్కురునున్న వారు పెదపెద్ద తెగుళ్ళక యగ్గమై యటం
చక్కట! తొలిసిపుచ్చకయ. అత్యధికంబగుభక్తిఁ జేయు నా
మొక్కులనన్నిటిం గరుణ ముందు గ్రహింపఁగదయ్య భాస్కరా!

ఉ॥ మొక్కులకేమి? పెక్కురును మున్ గృతపాతకులయ్యు నిట్టులే
మొక్కుచునుంద్రు. నే నెవరి మొక్కులటంచు గ్రహింతు?వరి యే
అక్కఱలంచుఁదీర్తునని యందువొ యేమొ. సురోత్తముండటం
చెక్కుడుభక్తి నిన్ను యజియించుచునుండు జనంబు భాస్కరా!

ఉ॥ రుగ్యుతుఁ డెంచనా నిను. మరుత్సఖునిం ద్రవిణార్థి. ఇద్ది వై
రాగ్యసమేతులైన ఋషిరాజుల నిర్ణయ. మట్లుగాన నీ
యోగ్యత నీక యున్నదని యొయ్యనఁ బెక్కురు మ్రొక్కుచుండి రా
రోగ్యముఁగూర్చి. నేను నటు మొక్కుచునుంటిని భక్తి భాస్కరా!

చం॥ ఎనిమిదొ తొమ్మిదో సమల యీడున నుండఁగ మూత్రకృచ్ఛ్రమున్
పెనుగద మొక్క డేరుపడి పెద్దయుఁబ్రొద్దును బాధపెట్టి పో
యినయది ముప్పదెన్మిదవ యేట. తదర్థముగా నె నే నినున్
ప్రణుతియొనర్పకుండినను ద్వత్కృపయే కత మందు భాస్కరా!

చం॥ పదిపదునాలుగబ్దముల ప్రాయమునన్ ముకునుండి నిత్యమున్
బెదరున రక్తధారలు స్రవింపఁగఁ జొచ్చె భయంకరంబుగా.
ఇదియును క్షోభపెట్టె కర మిప్పటి కిర్వది యేండ్లనుండి యె
య్యది యెదో పీల్వఁ దగ్గినది. అద్దియు నీదయ చేస భాస్కరా! ౨౮

ఉ॥ ఆమము వృద్ధిఁబొందె నొగి నయ్యెలప్రాయమునందు. అంత న
య్యామము గొంతునుండి పయి కాగతమై నసనస్సుతోడఁదా
యీనుహి నమ్మి చేయఁబడు చింతమక బాధకు హేతువయ్యెనన్
నామది కెక్కుదయ్యె బలునాళ్లుల దాఁక నదేమొ భాస్కరా! ౨౯

ఉ॥ ముమ్మరమైన మోహమును మొత్త సమర్థుఁడఁగామి వచ్చి పం
డొమ్మిదవబ్దమందునన దూరుజ లెంతయు నావరించునన్
వమ్మయిపోయె మేల్తనువు. వానిని వాని భుజింప నీదయన్
క్రిమ్మఱ స్వాస్థ్యమేర్పడియె. కాని పురాస్థితిరాదు భాస్కరా! ౩౦

ఉ॥ మూత్రముతోడఁ దేజమును బోవఁదొడంగెను నాఁటినుండి యే
మాత్రమొ దాననుండి యణుమాత్రము మార్పును జెందఁ జొచ్చెఁదా
గాత్రము. పాటవంబునకుఁ గల్గెను లోపమొకింత. ఐనన్
ధాత్రి భవద్ఘృణాబలమునం దనుయాత్ర కృతంబు భాస్కరా!

ఉ॥ ఇంకనుగొన్ని యామయము లింతవొ యంతవొ యాగతంబులై
సంకటపెట్టె కొంతవడి చన్నవి తిన్న ఘనౌషధంబులన్.
కింకరణీయతాజ్ఞుఁడను ఖిన్నుఁడనై మనఁ గొన్నినాళ్ళకున్
జంకి తమంతఁ దామ యవి చన్నవి యందొకకొన్ని భాస్కరా!

ఉ॥ ఉక్తులిఁకేల పెక్కు? లెవియో రుజ లప్డపు డంకురించుచున్
వ్యక్తములై యెయి కాకయె వినాశము నొందుచవచ్చె వెండియున్.
రక్తసమృద్ధమౌచు మెయి రాజిలుచుండిన యన్నినాళు లీ
యుక్తవిధంబునం గృతమహో! తనుయాత్ర మదీయ భాస్కరా!

ఉ॥ నాశముఁ జెందుచున్నయవొ నాదు శరీరమునందు గుప్తమై
యే శయనించియున్నయవొ యెవ్వఁడెఱుంగును గాని మామకీ
నాశయముల్ ప్రజాసముదయంబునకుం దెలియంగఁ జేయుచున్
దేశముఁ జుట్టివచ్చుటకు దేహబలం బద యుండె భాస్కరా. ౩౪

ఉ॥ నల్వదివత్సరంబులక నాదుశరీరమునందు రక్తపున్
కాల్వలవేగ మాఁగుటయుఁ గన్గవ నిద్దపు టద్దపుంగవన్
చెల్వును గాంచె. కాని నడునెత్తి విశేషము. తక్కుస్తోదలన్
మొల్వదు నల్లవెండ్రుకయు. మోము వివర్ణ. మిఁకేమి భాస్కరా!

ఉ॥ దంతము లొక్కటొక్కటి పదంపడి యూడఁగఁ జొచ్చె. కాళ్ళతీఁ
పెంతయు నేర్పడెన్. బలవిహీనుఁడనైతిని. దానఁ జేసి ర
వ్వంతశనిం బొనర్చుటకె యంగము లోపక పోయె. ఇట్లు బల్
వింతగ నష్ట నేను శతవృద్ధుగఁ దోఁచితిఁగాదె భాస్కరా! ౩౬

ఉ॥ దంశనపాతముఖ్యమగు తత్త్వవిరత్వపుఁ జిన్నెలన్నియున్
వింశతిహాయనప్రభృతి వేమఱు మూత్రములోనఁ బోవు ధా
త్వంశమునుండి యేర్పడియె నంచు వచించె నొకం. డతండు తా
భ్రంశ మొకింత లేని మతిపాటవమున్న భిషక్కు భాస్కరా! ౩౭

ఉ॥ బందరువాస మాయనది. పండితుఁడుం గవితామతల్లికిన్
విందును నైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిలుగారి శిష్యుఁ డా
నంది. కవిప్రియుండు. కరుణం గని యార్తుల మర్మివార్యపున్
క్రిందులె పాపు. శేషగిరిరావని పిల్చు జనంబు భాస్కరా! ౩౮

ఉ॥ శ్రీలఁదలిర్చు బందరుపురిం గయిసేయుచుఁ బేర్మిమైని హై
స్కూలునఁ బండితుండుగను శోభిలు వేంకటశాస్త్రిగారికిన్
బాళి భజించిరా నరుగుపట్టల నాగిరిరావుతోడుతన్
చాలినయంత సౌహృదము నాకు ఘటిల్లెఁగదయ్య భాస్కరా!

చం॥ బలమఱి ప్రొత్తవార్ధకుని భంగిఁ గనంబడుచున్న యట్టినా
నలువదియొక్కవత్సరమునన్ మఱి బందరుఁ బోఁ దటస్థమై
తెలిపితి నాదు దుస్థితిని దెల్లముగా గిరిరావుతోడుతన్.
సలిపెను దచ్చికిత్సకుఁడు చయ్యన మూత్రపరీక్ష భాస్కరా!

ఉ॥ ఇర్వదియేండ్లనుండియును నేగెడి సారము దాననుండి నన్
పర్వఁగనున్న నంజురుజ బాగుగఁ దోఁచెను రుక్ప్రతిక్రియా
ధూర్వహుఁడైన యాయునకుఁ. దోడన స్నేహితుఁడౌటఁ దద్ద్విజా
గర్వమడంచు మందు నిడె. కైకొని తింటిని నేను భాస్కరా! ౪౧

ఉ॥ సంహననంబు కొంత బలసంయుతమయ్యెను దాన. తద్విజా
సంహృతి యాటకాదలఁచి స్వాస్థ్యమునొందితి. షట్కరత్తు లే
యుంహతికిన్ వశుండ నయి యాత్మనుగుందక భక్తినొదలన్
సంహతలంబుఁజేర్చి సురసంస్తుతిఁ బుచ్చితి నెట్లొ భాస్కరా! ౭౨

ఉ॥ అప్పటి కామవాతమను నామయ మొక్కటి యంకురించుచున్
దెప్పర మిద్దినా కటులె ధీరత మూడు నెలల్ సయించితిన్.
ముప్పుకు మూలమయ్యె నది.మూలన త్రోయను సిద్ధమయ్యె.హా!
చెప్పెదఁ దత్స్వరూపమును దిన్నగనీ కవధారు భాస్కరా! ౭౩

ఉ॥ జానువునందు ముల్ మొలిచి చల్లగ నొప్పి యదే క్రమంబుగన్
మారినయి తుంటిలోని కతిమాత్రముగం బాడువం దొడంగె. ఆ
పైనను రెండుపిక్కలును బల్మిని రోట నలంగఁబాడ్చిన
ట్లైనను క్షోభపెట్టె. ఇఁక నక్కట! ఏమివచింతు భాస్కరా!

ఉ॥ దేహమునందు వ్యాప్తమగు తీఱని తీఁపుల తోడఁ గూడి నేన్
గేహమునుండి కాల్కదపనేరక గర్తపురిన్ వసింప శి
ష్టా హనుమన్మనీషి కని సన్మతి బుల్సు ప్రసాదరావుతో
స్నేహము గూర్చి నిర్వురని జేరిచి యొక్కట వేగ భాస్కరా!

శా॥ ఆయుర్వేదకలావిశారదుఁడు కాంగ్లేయభాషావిదుం
డాయార్యుం. డమలాపురోరుభవనుండై కూడఁ దత్కాలసం
దాయూరన్ ఘనవైద్యుఁ డీతఁడనుపే రార్జించియున్నాఁడు. మే
ధాయుక్తుం. డవధాని. సత్కవియు విద్వన్మిత్రముల్ భాస్కరా!

మ॥ హనుమచ్ఛాస్త్రిలు మందు మందువెల యెంతౌనో వచింపంగదే
అని ప్రశ్నింపఁ బ్రసాదరావు మదిఁ దా నంగీకరింపండు. కై
కొని భక్షింపుఁడు వెన్కఁజూతమనువాక్కుం బల్కియట్లిచ్చుచున్
తిని సారోగ్యుఁడనైతి నొక్కనెలకే తేజంబురా భాస్కరా! ౭౭

చం॥ ప్రకటభిషక్క శేషగిరిరా. వతఁడిచ్చినయౌషధంబు వే
ఱొకస్థితి పట్టుకొండ నప్పుడో మొనె కాని యుణంకదయ్యె మా
మకమగు మూత్రదోషమును. మందు తదంతికమందె యుండి పూ
నికమెయిఁ జాలినంత తిన నే. నద కారణ మిందు భాస్కరా! ౭౮

శా॥ తత్తేజఃక్షతినుండి నాదు బలుమై దౌర్బల్యభూయిష్ఠమై
టత్తేజస్వి ప్రసాదరావు కని తా నం దింకఁగొన్నాళ్లు లా
యత్తిన్ నిల్పి ప్రదత్తభేషజముచే నారోగ్యముం గూర్చి నన్
పుత్తెంచం బదియేండ్లు మట్టి బలసంపూర్ణుండనై భాస్కరా. ౨౯

ఉ॥ ఉల్లమునందు నిన్ నిలిపియో మఱి నిల్పకొ యర్ఘ్యపుష్పమిషన్
నీళ్ళను విప్పుచుంటి. మఱి నిత్య ముపస్థితిఁ జెప్పుచుంటి. నీ
పేళ్లు పఠింప కెన్నడును బెట్టియెఱుంగను ముద్ద నోటిలో.
చెల్లనె త్వత్ప్రసాదమును స్వీకృతిసేయుట కింక భాస్కరా!

చం॥ నిలిచెద నీదుకట్టెదుట నే నపుడప్పు త్వదేకదృష్టితో.
కొలిచెద మానసంబునను గూరుచుచున్ సకలోపచారముల్.
పిలిచెదఁ బావనంబులగు పేరుల. దీనికిఁ ద్వద్వితీర్ణమౌ
ఫలము ప్రసాదరావు. పలుభావములతోడ నిఁకేల భాస్కరా! ౩౧

ఉ॥ నాల్నెల లట్టె యుంచుకొని నా బలహీనతఁ గీళ్ళనొప్పులన్
కాల్నడ సాగనంపుటయ కా కల బుల్పు ప్రసాదరా విఁకే
వేల్నలిగల్గినన్ మఱొక వెజ్జు స్మరింపకుఁ. డేన యెప్డు మీ
మే ల్నడిపించుచుందునని మిత్రజనుస్త్వము చాఁటె భాస్కరా!

చం॥ నలువదియేడవబ్దమది నాకు. తదాది పదేండ్లదాఁక నే
నలియును లేక పత్రికను నప్పితి. దేశములం జరించితిన్.
తొలుతటిభార్య పోవ మఱి తోడన పెండిలిఁ జేసికొంటి. ఆ
కులసతియందుఁ గాంచితిని కొడుకులఁ గూఁతును బ్రీతి భాస్కరా!

ఉ॥ వ్రాసితి వ్యాసరాజముల వందిన కన్నడు మెత్తకుండఁగన్.
చేసితిఁ బద్యపున్ రచన నేఁ బదివేలకు లోటులేనటుల్.
డాసితిఁ గాల్నడన్ రయము దవ్వులనుండినయూళ్ళ. ఇంతయున్.
గాసిలఁ ద్వత్ప్రసాదపరికల్పితదార్ఢ్యముకల్మి భాస్కరా!

ఉ॥ ఏఁబదియేడవబ్దమది యింకను వచ్చెనొ లేదొ వచ్చినా
పైఁ బడె శీతపున్ జ్వరము, పక్షమొ మాసమొ యేడిపించె. ఏ
దేవెలొ వైద్యులాట నట దివ్యతరౌషధమే లభింప కే
ఏఁబదినాళ్ళకో చివర కే జ్వరముక్తుఁడ నైతి భాస్కరా! ౩౫

చం॥ వడివడి నేఁగె నింక నొకవత్సర మెప్పటియట్టు. లింతలో
నడుమున నొప్పి యేరుపడి నన్ బడఁ ద్రోసెను బూర్తిగాను. కా
ల్లడుగను వంగలేక సుసుఖంబుగ నేలను గూరుచుండలే
కొడలు వశంబుగాక యయయో యనికుందఁగ నయ్యె భాస్కరా!

చం॥ కుదురుగఁ గూరుచుండి యొకకొంచెము వ్రాయఁగ లేకపోయితిన్
పదుగురు బాగనంగ నొకపద్యము వ్రాయఁగ లేకపోయితిన్.
పదము కదల్చివైచి పదిబారలు నడ్వఁగ లేకపోయితిన్.
హృది ముదమేదియేది పొనరింపనుజాలకపోతి భాస్కరా! ౫౭

చం॥ నడుము ప్రధాన మంతకుఁగనన్. మొద లానడిమింటిచట్ట మే
ర్పడిన సమర్చుకోఁదగెడిఁ బై సమలంకృతి. తద్రిథాకృతిన్
తొడిగినఁ గండ్లు నడ్చునిఁక, తొల్తటిచట్టమె లేకయున్నయ
డ్డడుగును మీఁదునుండియును నంతయు వ్యర్థముగాదె భాస్కరా!

చం॥ అడుగును మీఁదునన్ నడుము నన్నియు నున్న నెయేదియేనియున్
నడుచును. మత్తనూరథమునన్ నడిచట్టము కీడ్పడం బడం
పడి యెటు దేహయాత్ర జరుపన్ వలెనో తెలియంగరాక చే
డ్పడుడుఁ బ్రసాదరావ రహిఁ భావమునంబడె వచ్చి భాస్కరా!

మ॥ పదినాళ్లిట్లనుభూయమానకటిరుగ్బాధుండనై యంత ని
ర్వదియో ముప్పదొ యోజనంబులపయిన్ వర్తిల్లుసత్సంపదా
స్పదమా నయ్యమలాపురంబునకుఁ బ్రస్థానంబుగావించితిన్
సదయస్వాంతప్రసాదరాయవిహితస్వాస్థ్యుండఁగా భాస్కరా! ౬౦

మ॥ మెయి స్వాధీనమునందులేనికతనన్ మిత్త్రికముంగూర్చియే
అయినన్ నేను కుటుంబయుక్తముగనే యానంబు గావించుచున్
దయమానం బగు మేటిపుష్పగిరిసంస్థానంబు దర్శించి మా
ద్వ్యయవిత్తాత్మకసత్ప్రసాద మట నొందంగోరితిన్ భాస్కరా!

మ॥ దివసద్వంద్వము రెంటపాళ్ల రహిఁ దత్పీఠంపుసాన్నిధ్యమం
దు విలంబంబొనరింప నందులకు నాతోఁబుట్టుబిడ్డండు వ
చ్చి విచార్యం బనివార్యమున్ మఱియు నాచేఁగార్యముంబూర్యమా
వ్యవహారంబునకై మరల్చె నను దుష్పాకంబునన్ భాస్కరా!

ఉ॥ స్వవ్యథ సైపన్న మదినస్మృతిఁజేసి మదీయభ్రాతృపు
త్రివ్యవహారనిర్వహణతత్పరచిత్తత నిల్లు చేరుదున్
నవ్యముగా బయల్వెడలె నాదుపిఱుందునఁ బిక్కనొప్పి పూ
ర్వవ్యథ యాఁగె. దీనఁగలవాస్తవికార్థ మదేమొ భాస్కరా !

చ॥ వడవడిఁ గూరుచుండఁగను వంగను లేవను జేతఁగాక పె
ల్లుడికెడినాకు నాదునొడ లోలి నధీనముకాఁదొడంగినన్
నడచిన శ్రోణిజంఘఁ గలనాడులు లాగుటఁజేసి తుంగఁబో
విడుచుచు మొద్దు నెత్తుకొనుహీఁక ఘటించె నిఁకేమి భాస్కరా !

ఉ॥ రాకకుఁబోకకుం బిడుగురాళ్ళ సమీకము జానపాటి. కే
వీఁకనొ స్త్రీలు బాలకులు వృద్ధులునుం జరియించుచుందు రా
ఏకపదిన్ సదా. అచటి కేగను రా నసమర్థమాటయే
కాక మదంగ మన్నిటికిఁ గానిదియయ్యెఁ గదయ్య భాస్కరా !

ఉ॥ గ్రామబహిస్థలంబునకె గ్రక్కున నేగ నశక్యమాట నె
న్నో మజిలీలు వేయుచు నెటోచని రావలసెన్. బజారులో
ఏమియొనర్ప నేగినను నెన్నియొ తిన్నెల విశ్రమించుచున్
ధామముఁ జేరఁగావలసె, తాల్మిచెడన్ వలసెంగ భాస్కరా !

చ॥ కదలి పద్దైదుమాజ్జలను గట్టిగఁ బెట్టుటతోన లాగఁగన్
మొదలిడుఁ బిక్కలోనినరముల్. మఱికొంచెముదూర మేగ నా
ఒదవిననొప్పి పెద్దయగు. ఓరుచుకొంచు నటే చనంజనన్
తుద కడు గెత్తరాక భువిఁదొట్రిలుచుం బడుచుందు భాస్కరా !

చం॥ విసికి ధరిత్రిఁ గూలఁబడి వేమఱుఁ గేల్గవఁబట్టి జంఘ వే
పిసికి యొకించుకంతశ్రమ పెద్దయుఁ బొద్దునకున్ శమించుడున్
మసలక లేచి వెండియుఁ గ్రమంబుగఁ గొంతగమించి వెండియున్
పిసుకుచు లేచి నడ్చుచును బిట్టుశ్రమం బడుచుంటి భాస్కరా !

ఉ॥ పిక్కకునుం బిఱుందునకుఁ బేరిమినుండినసూత్రి మేమొ యం
దొక్కటి నొవ్వ రెండవదియుం గడునొచ్చెడి నట్లె. ఒక్కచో
ఎక్కువయైన వేఱొకట నెక్కువయా. ఇటు రెంటిసందునన్
చిక్కితి. చిక్కుచుంటి, బలుచిక్కిది. ఏగతిఁదీర్తొ భాస్కరా!

ఉ॥ పిక్కపిటుందులం దటుచుపీఁకుడుగానము మానవాళి. నా
ఒక్కనికోసమే దుహిణుఁ డోపికతోడ సృజింపఁబోలు. అ
మ్మక్క! భిషక్కు లొక్కరును వ్యాధ్యభిధానము చెప్పలేకయే
పక్కలుచూతురొక్కొ యిది ప్రాతయులంతయమైన భాస్కరా!

ఉ॥ దగ్గఱ వైద్యు లెవ్వరును దానిస్వరూప మెఱుంగరైరి. ఇం
కగ్గిరిరావొ తాను గబురంపుచునుండు ప్రసాదరావొ తా
మిగ్గదముం గుదుర్తురని యెంతయు నమ్మకముండె. వారలన్
డగ్గర నెంతకుం దెలిపి నాకుఁ దటస్థముగాదు భాస్కరా! ౨౧

ఉ॥ చన్నవి రెణ్ణెలల్. పనులు సాఁగ వొకించుకగూడ. అప్డునా
కున్నయసాధ్యమైనపని యొక్కఁడె. అయ్యది యెద్దియన్న నా
అన్నకొమాళ్ళపాలఁ గలయప్పుపరిష్కృతి. అద్ది యెన్నినా
ళ్ళున్నను దీరదయ్యె. అదియున్ మదదృష్టము కాదె భాస్కరా!

ఉ॥ తీరియుఁ దీరకుండఁగనె తీరిక యించుక నాకుఁ జిక్కుడున్
దూరగ తామలాపురముతోవ్రవను బోవక యంతకన్ననున్
చేరువయైన బందరును జేరఁగఁబో గిరిరావుగారు నన్
గౌరవబుద్ధిఁ జూచి యొసఁగందగువాని నొసంగె భాస్కరా! ౨3

చం॥ నలువదియేండ్లప్రాంతమున నాకుఁ దదర్పితముల్ సులోచనం
బులు. పదునాలుగేడు లవి పుస్తకము ల్చదివించె. వానితో
కలవని లేకపోయె నిఁక. గ్రంథము లేవియు లేకె చూడఁగన్
కలిగితిఁగావి దూరగము గన్గొనఁజాలఁగనైతి భాస్కరా!

ఉ॥ తద్దయు దూరదృష్టి యటుతగ్గుటయున్ గిరిరావునొద్ద నీ
అద్దములున్ లభించుననునాస మతెవ్వియుఁ బెట్టుకొకయే
ప్రొద్దులుపుచ్చఁబుచ్చ నటుపోవుట నాఁటికి సంభవించె నా.
కద్ది వచింప నాతఁ డపు డక్షుల నద్దము లుంచె భాస్కరా!

ఉ॥ చెప్పితిఁ బిక్కలాగు. డది చిన్నయులంతయు కాఁ దలంచుచున్
చప్పున నేదొ యీఁగడఁగె. చన్నవి కొన్నిదినంబు. లెంతకున్
నొప్పి శమింప. దన్నదురునోదన మూత్రపరీక్షచేసి. తా
అప్పుడు ధాతుపాతమును నాతఁ డెఱుంగఁగఁగల్గె భాస్కరా! ౨౬

శా॥ ఆయోజఃక్షతి మున్ గ్రహించినఘనుం డాతండె. ఎన్నాళ్లనాఁ
డో వైయుండినకార్యమాట మఱచెన్. యోజించె న పెంతయు
న్ధీయుక్తిం గటిజంఘు లెంతయును నార్తిం జేఁతకుం గారణం
బీయోజగక్షతియే యటం చెఱిఁగె. మం దిచ్చెం గృపన్ భాస్కరా!

చ॥ ఇరువది వాసరంబులకు నిచ్చుచు మందును గోదుమన్న మే
మఱక భుజించుచుండుఁ డిఁకమాపుల నంచని చెప్పిపుచ్చ నే
నరిగి యదేప్రకారముగ నన్నము మందును దింటిఁగాని నా
పిఱుఁదును బిక్క చక్కనయి పెంపువహింప వదేమొ భాస్కరా!

శా॥ గోధూమోదనఖాదనంబుననొ తద్గుర్వౌషధప్రాశన
ప్రాధాన్యంబుననో నిరంతరకృతాభ్యాసంబునం జేసియో
బాధన్ సైఁచుచు దూరమేనియు గమింపంజాలి తద్వార్త నే
నాధీమంతునిగూర్చి వ్రాసితిఁజుమీ హర్షంబునన్ భాస్కరా!

శా॥ నే మున్నిచ్చినమందె విచ్చి యదియున్ నేమంబునన్ రాత్రి గో
ధూమాన్నంబును దింపుఁ గొంతవడి యొందుంబోక స్వాగారవి
శ్రామంబుం గయికోఁ గ్రమంబుగ భవజ్జంఘామయం బాగునం
చామిత్రుండు జవాబువ్రాసె నపుడే యత్యాదృతిన్ భాస్కరా!

మ॥ ఎవ రేవ్రాఁతలు వ్రాసినన్ నలువ మున్నే వ్రాఁత దా వ్రాసెనో
అవు నామాదిరిగాను గాన నిఁక నెట్లామందుఁ దెప్పింతు? మ
ద్భవనంబంద యెటు ల్వసింతు? నిలిపెన్ భ్రాత్రీయకార్యంబె న
న్నివలం గాలిడకుండ నాల్గునెల లింకేముందుదున్ భాస్కరా!

మ॥ ధనమా చాలినయంత లేదు. మఱియున్ ధర్మప్రచారార్థమై
మును స్థాపించినమాసపత్రిక నెటో పోషించుచుండన్వలెన్.
మను ముద్రాక్షరశాలలోన ఋణ మేమాసార్థ మామాస మీ
యను లేకుంట. ఇఁకెట్టు లుందు నొకచో నానందినై భాస్కరా!

ఉ॥ అర్థసమృద్ధి లేదు మొద. లందుల కట్టిటు పోయిరాక యే
అర్థము నిర్వహించుకొనుసత్త్వత లేక తపించుచుండునీ
వ్యర్థున కంఘ్రిలాగుదున కావల నప్పులలాగు డెక్కుడై
అర్థన కన్యదేశముల కన్పె. ఇఁకేమనువాఁడ భాస్కరా! ౮౩

చం॥ అరిగి నిజాము దేశమున యానము లెవ్వి లభింపనట్టికా
సరణులఁ బిక్కలాగుడును సైఁచుచుఁ గాల్నడయే పొనర్చి రా
తిరులను గోదుమన్నమును దించుఁ గ్రమంబుగఁ బత్రికాభృతుల్
తిరిగి వసూలు చేయు నెడ దేహము డస్సెఁ గరంబు భాస్కరా! ౮౪
ఉ॥ డస్సినయట్టి దేహము హఠంబున వచ్చి జ్వరంబు సొచ్చుదున్
భిన్న రుచింప 'కర్హమగు భేషజ మిచ్చెడివా ర్లభింప కే
నుస్సురటంచు స్వీయమగు నూరును జేరితిఁగాని యెంతయున్
లెస్స వహింపలేక శకలీకృతచిత్తుఁడ నైతి భాస్కరా! ౮౫
మ॥ జ్వరముక్తుండనుగాక కొన్నియహముల్ స్వాద్వన్నపానంబులం
దరుచిం గొన్ని దినంబు లభ్యవహృతం బౌనన్న పానీయముల్
త్వర జీర్ణింపక కొన్ని నాళ్లు మలనిర్బంధంబునం గొన్ని నా
ళ్లరికట్టంబడియున్నవాఁడ నిటులే యార్మాసముల్ భాస్కరా! ౮౬
ఉ॥ బొత్తిగ లేవలేకయును పూని పదంబులు పెట్టలేకయున్
రిత్తగ నున్న దంతయును రెండు నెలల్. తరువాత వెండియున్
క్రొత్తకవిత్వమున్ నడచె. కొల్లగ వ్యాసములన్ లిఖించితిన్
విత్తము పొందె నూళ్లవయి వెళ్లి చరించుచునుంటి భాస్కరా! ౮౭
ఉ॥ ఏకవనంబు గూరుపకె యేబలు వ్యాసములన్ లిఖింపకే
ఏకడ కేగిరాకె మఱియె ట్లిఁక నాగరఖండముఖ్యగ్రం
థాకరమై మనీషిహృదయంగమమై యలరారుపత్రికన్
సాఁకఁగలాఁడ ? ధర్మమును జాటఁగలాఁడను నేను భాస్కరా
శా॥ సారాన్వితపురాణధర్మనిజభాషావ్యాపనోరుస్పృహన్
ధీరంమన్యవిచారదూరజనతాధిక్కారకృత్యాదృతిన్
ప్రారబ్ధార్థము సాఁగుచుండవలెనన్ భావస్థమాపూన్కి ని
ట్లారాటంపడుచుంటిఁగాని యగునే సారోగ్యతన్ భాస్కరా! ౮౯
ఉ॥ పిక్కపిఱుందులందుఁ గలపీఁకుడడంగదు. నోటికన్నమున్
మిక్కిలి పోదు. పోయినది మిత్తికి దీటయి పొట్ట యంతయున్
నొక్కు. శకృత్తు వెల్వడదు. నోటియసహ్యత తీఱు. దొక్కనా
ఉక్కును లేమియుం గతములూఱుటలేక చరింప భాస్కరా! ౯౦

చ॥ గదమును రూపుమాపుటకు గట్టిప్రయత్నము చేయకుండనే
అది యిది తించు నూఅడిల కట్టిటు బిట్టుభ్రమించుచుండుడున్
మెదు కొకయింతయున్ రసనమీఁదికిఁ బోవక మై యసారమై
పదిలముగాను లేచుటకె పాల్పడదయ్యె నిఁకేమి భాస్కరా!
మ॥ అలగుంటూర్పురి నప్డె నాకుఁ గడు వేగ్రఁగా పత్రికాకార్యమే
ఒలయుంబోవుట సంభవించి ఘనవైద్యుం డన్ యశశ్శ్రీకిఁ దా
వలమా సత్కవితాన్వయాబ్ధిశశి సుబ్రహ్మణ్యులోగింటిలో
పలఁ గాల్పెట్టుడు నాతఁ డాదృతి నిడెం బాద్యంబు మున్ భాసరా!
శా॥ హిందూవైద్యులఁ జూచుమాత్రమునఁ జేయింజూపునార్తప్రజా
బృందంబుం బలె వ్యాధిపీడితుఁడనౌ నేన్ నాదు చైఁజూపుడున్
కందమ్ముల్ కుకుళించి యాతఁడు మదిం గావించి ధ్యానంబు నా
చందం బేను వచింపకుండ నుడివెన్ సర్వంబునున్ భాస్కరా!
శా॥ దత్తాతిథ్యత నింటనుంచుకొని యాతం డౌషధం బీయ న
ట్లాత్తం బగ్నికుమారమున్ మెసవి మధ్యాయాతమా వ్యాధి కిం
చిత్తున్ లేక నశించినట్లగుచు దానింగూర్చి తర్వాత నే
ఎత్తున్ లేక యథాప్రకారముగ నే యేనుండితిన్ భాస్కరా!
శా॥ జంఘాశ్రోణిశిరాళి గుంజు టది యీపన్మాత్రముం దగ్గ కిం
కం ఘీంకారము సేయుచున్నది కదున్. కాయంబు నిస్సారం. మీ
సంఘర్షంబుననుం జికిత్స కవకాశం బబ్బ దేమంచు మ
జ్జంఘూలత్వవినాశ కాలమది సంప్రాప్తంబు కా భాస్కరా! ౯౧
ఉ॥ కావున నన్న మిష్టముయి ఖాదితమైనది జీర్ణమౌటకుం
జేవ యొకింత యేరుపడి చిన్నగఁ గుంటినడన్ గమింప నేన్
త్రోవలు సాఁగుచుండుటకుఁ దుష్టిని జెందుచునుంటిఁగాని నా
భావిమహాపదన్ మదిని భావనసేయఁగనైతి భాస్కరా!
మ॥ జ్వర మంతర్గతమౌ టెఱుంగ కెటో కాల్సాఁగుంగదా యంచు నే
మరలంబోతి నిజాముదేశమున కార్యాసంబు లౌమీఁదటన్.
తిరుగంజాలితి నొక్కమాస. మటుపై దేహస్థమైయున్న యా
జ్వరమే శ్రీముఖవత్సరాది సరిగం బైకుబ్బెఁ దా భాస్కరా! ౯౨

ఉ॥ ఆ జ్వరబాధతోడ నలయాడవరంబును జేరఁబోవుడున్
యజ్వవిపశ్చిదాదివిపులామరపూరితమా స్వగేహమం
దుజ్వలదుగ్రతేజుఁడయి యొప్పుపరాంకుశరాట్టు దానిఁ దా
రజ్వవరుద్ధమైనపసిరాణ నొనర్చె రయంబ భాస్కరా! ౯౫

శా॥ ఓనారాయణ! రామ! కృష్ణ! హరి! అం చుచ్చైర్ధ్వనినాదంబుతో
నే నత్యంతము బాధనొందుటను దా వీక్షింపఁగా లేక యా
క్ష్మానాథుండు స్వవైద్యతల్లజులతో సంధించి యోజించియున్
క్వైనాచేత జ్వరంబు గట్టివయిచెన్ వైళంబుగా భాస్కరా!

శా॥ బద్ధంబైనజ్వరంబు నన్ను మిగులన్ బాధింపలేకుండుటన్
శ్రద్ధం దన్నృపురాణి సత్య తనదా జైమీఁదుగాఁ బథ్యమున్
సిద్ధంబుం బొనరించి పెట్టుటను గించిత్కాంచి దారోగ్యసం
సిద్ధిం గాంచుచు నుంటి మాస మచటన్ క్షేమంబుగా భాస్కరా!

చ॥ దొర దొరసాని యాదరముతో ననుఁజూచుచు మత్సపర్యలన్
జరుపుచునుండి రన్వహము. సంతసపెట్టుచు నుండి. రైననున్
జ్వరము సమూలమై చనదు. పంపరు నన్ స్వగృహంబునుండి వార్.
హరహర! కూపకూర్మమయి యట్లై వసించితి నింక భాస్కరా!

చ॥ జ్వరము సుసూక్ష్మమాటఁ గడుసంకటపెట్టదు. పథ్యపానముల్
సరిగ నమర్పఁగాఁబడెడి. జాయువు వేళకు భక్ష్యమాణ. మీ
కరణిని లేదు లోప మెట. కాని శిరస్థితమైనకార్యపున్
భరమె త్వరంబొనర్చుటయుఁ బైనముసేయఁగనయ్యె భాస్కరా!

శా॥ చందా ల్వాలవసూలు కావలయు. ఆచందా ల్వసూల్చేసి మున్
ముందే సార్థశతంబురూపికలు తన్ముద్రాక్షరాగారమం
దందింపన్ వలె. అంగిరోబ్దమది యాయె. వృద్ధి యీకుండ నే
క్రిందులూచినఁ బత్రికన్ మరల ముద్రింపింత్రె వార్ భాస్కరా!

ఉ॥ పత్రికయే మదీయమగు ప్రప్రథమాత్మజ. నాకుఁ బుత్రికా
పుత్రులు పుట్టులోపల నె పుట్టిన. దిర్వదినాలుగేం. డ్లివా
మిత్రము లాకె నాకు. అదె మూలముగం బ్రతిమాస మేను ద
త్పత్రిక సాఁకుచుండవలె దండివ్రతం బది నాకు భాస్కరా!

ఉ॥ చైత్రము వెళ్లవచ్చుటను జయ్యాన సార్థకతార్థమేని త
ద్గోత్రను బత్రికాభృతులు తొల్త వసూలొనరించి వేళకున్
పత్రిక వెల్లడించుటకె పైనము యాడవరంబునుండి. ఆ
యాత్ర పరాంకుశప్రభునియాత్త కభీష్టముగాదు భాస్కరా !

ఉ॥ ఇంక జ్వరాంకురంబు నశియింపనె లేదు. గమిష్యదధ్వముల్
పొంకములేక కాల్నడనె పోవఁగఁదగ్గవి. అట్టుగాన ని
శ్శంకగ నిప్డు దేశునెడ సారె జ్వరార్తి ఘటించునంచు నా
టంకముపెట్టె నాతఁడు. హఠంబున లేచితి నైన భాస్కరా!

ఉ॥ ఆదార చెప్పినట్లె యొకయామడ నడ్చుటయున్ సికిందరా
బాదునఁ బైకిఁబొంగె మఱిపాడుజ్వరంబు. మదూహలన్నియున్
బూదిని బోయునేయి యయిపోయె. ఒడల్కడుమండఁజొచ్చె. ఆ
బాదకుఁ దాళమిం డెయినుపైఁ బడనయ్యె దురితంబ భాస్కరా!

చ॥ పడి వడి నిల్లుఁజేరితిని. భార్యను బుత్రులఁ జూచుకొంటి. వె
న్నడికొనువ్యాధినుండి పలునాళులు చేష్టడితిన్. క్రమంబుగా
సుడివడి యన్నపుంగడిని జూచుటకేనియు నోచుకోక పె
ల్లుడికితి. అన్నిటం జెడి యలోయని మూల్గుచునుంటి భాస్కరా !

మ॥ అఱకాల్గ దగ్గఱనుంచి నెత్తివఱకు కాహా! నాదుమై నిప్పులన్
పొరలింపంబడినట్టు లయ్యెడిది. ప్రేవు ల్వాళ్ళిరా దగ్గి వే
మఱు నాయాసపడంగ నయ్యెడిది. బల్మంచంబుపైనుండి చె
చ్చెర డిగ్గంగ నశక్యమయ్యెడిది. ఇస్సీ! ఏమనన్ భాస్కరా!౧౦౯

ఉ॥ పిక్కపిఱుందులందుఁ గల పీఁకుటటుండఁగ నూతనంబుగన్
తక్కుశరీర మంతటను దద్దయుఁ బీఁకఁదొడంగె రేబవల్.
కక్కడుకూఁతలన్ సతము లప్పుఁడులప్పుఁడు కళ్ల వెళ్లి నల్
పక్క లసహ్యమున్ సలిపె. రాచె గళంబు కరంబు భాస్కరా!

చం॥ ప్రతిదినమున్ విరేచనము బాగుగఁగామిని విష్ఠచేతఁ బూ
రిత మగుకుక్షినుండి పులితేన్పులు పుల్లనికంపులున్ విని
ర్గతమయి యేవముంగొలుపు. గర్భము బర్వగుచున్ వికారపున్
గతుల మదింగలంచు. తొలికర్మవిధం బది యేమొ భాస్కరా !

చ॥ నడికొని మాత్రవేసికొనునాఁడె విరేచన. మల్లనాఁడు వెం
బడిఁబడి పెక్కు వారములు పంపు బహిస్థ్సలి. కన్నిసారులున్
నడువఁగలేక చావవలె. నల్ల రవంతయు లేక యెంతయున్
మిడికెడి పాదరోగి కది మిక్కిలికష్టముగాదె భాస్కరా! ౧౧౩

మ॥ ఘనవైద్యుం డొకఁడేని యప్పటికి మార్గాంబునన్ లేనెలేఁ.
డనఘుండైన ప్రసాదరావు మదిలో నాసీనుఁడై యున్నవాఁ.
డనివార్యంబయి పిక్క చక్కపఱుపన్ యానంబు తత్సేను కుం
డెను. కానన్ మఱి రుక్ప్రతిక్రియకుఁగా నేఁ బూనఁజూ భాస్కరా.

ఉ॥ అట్లని పెక్కురోగముల కాకరమయ్యెను దజ్జ్వరంపుఁ బె
ట్స్వట్లొకకొంత తగ్గుపయి నిర్గతిసేయఁదలంచి బాధ నె
ట్లెట్లొ సహించుకొంచు నటులే నివసించితి మాసయుగ్మ. మ
ప్పట్లను గొంత చల్లఁబడె వర్షమును వర్షపురాక భాస్కరా! ౧౧౪

చ॥ తనువొకకొంత చల్లబడఁ దగ్గెను మంటలు. నోటిచేఁదునన్
తనుతవహించె. ఓగిరము నాల్క కొకింత రుచించె. కాని యా
తిసినది వేగ జీర్ణమయి దేహముఁ బర్వదు. పుష్టినీదు. పా
సనమునుగా. దిఁకివ్విధము స్వాస్థ్యమునొందివసింతు భాస్కరా!

ఉ॥ దానను దీన నించుకయు దార్ఢ్యము లేకయుఁ గూరుచున్న త
త్స్థానమునుండి లేచుటకె శక్యముగాకయు నంజుగూడ గ
ర్భానఁ బ్రవిష్టమయ్యెనని భ్రాంతుఁడనౌ తరువాత లేచితిన్
నేను బ్రసాదరావుమనునేలనుగూరిచి యెగ భాస్కరా! ౧౧౬

ఉ॥ తక్కు తెగుళ్ళ నన్నిటిని దత్తదహస్సుల కర్మభంగిగా
ఎక్కడొ యేదొ మందుతిని యే శమియింపఁగఁజేసికొంచు నీ
ఒక్కటి పిక్కనొప్పి యటు లుంచినవాఁడఁ బ్రసాదరావుచే
ఉక్కడగింప. కాని మఱి హుమ్మని యన్నియుఁగ్రమ్మె భాస్కరా!

ఉ॥ అన్నియు నన్నుఁ జుట్టుకొని యారుజ లెంతయు బాధపెట్ట న
న్నన్నయటంచు మూలుగుచు నప్పుడు లేచి ప్రసాదరావు స
త్సన్నిధిఁజేరినాఁడ. మఱి సర్వమునున్ వినిపించినాఁడ. ఆ
ఉన్నతుఁడంతయున్ విని యహోయని యార్చినవాఁడు భాస్కరా!

ఉ॥ ఊరిచి యూరడించి తన యోకమునందె ప్రవేశపెట్టి పె
ల్లోరిమి స్నానపానశయనోదనముఖ్య సుఖోపచారముల్
దారసుతానుజాదికుల ద్వారమునన్ జరిపించు చోషధీ
సార మిడం గడంగె ధుతసారుఁడనైమను నాకు భాస్కరా!

మ॥ అగదంకారజనప్రకాండుఁ డితఁడే యానాఁ బురాణజ్వరం
బు గుదిర్చెన్ మొద.లద్ది నాదుమెయిలో మూఁడేండ్లనాఁడే భృశం
బుగఁ దాఁ జొచ్చి వసించుచున్నయది. ఎప్డున్ వీడిపోఁజూడ కా
కుగదం బెంతయు నేఁచుచున్నయది నన్ గూఢంబుగా భాస్కరా!

ఉ॥ గూఢముగాఁగ నుంచు మెయిఁ గొన్ని దినంబులు పైకివచ్చి నన్
గాఢముగాన యేఁచెడిని. కళ్ళ విశేషము వెళ్ళుటాదిగా
రూఢములౌచు వర్తిలెడి రోగములన్నియు దానిభృత్యు. లే
మూఢత నష్టై పోయెనని బుద్ధిఁ దలంచుచునుంటి భాస్కరా!

శా॥ పిక్కం దుంటి సతంబుఁ జేడ్పుఱచు నా పెన్వ్యాధికంటెం గదున్
ప్రాక్కాలీనమె యీజ్వరంబనియు నీరక్తస్సె మూలంబు తా
దృక్క్రూరామయరాజిరాక కనియుం దెల్లంబుగం దెల్పి ముం
దక్కుల్యుండు తదత్యయంబు సలిపెన్ యత్నంబునన్ భాస్కరా!

చ॥ ఇరువదియేండ్లవాఁడనయి యే మనుచుండిననాఁటినుండియున్
వరఁగెడిమూత్రదోషము క్రమంబుగ నన్ బలహీనుఁ జేసె. ప
ల్మఱును బలంబురాకకయి మందులు తింటినిగాని యవ్వియ
త్తఱి బలకారులయ్యును బదంపడి వ్యర్థములయ్యె భాస్కరా!

మ॥ చెలువా గాత్రమునందు వర్తిలు రసాసృఙ్మాంసమేదోస్థిమ
జ్జలునున్ శుక్రము సప్తధాతువులు. తత్సారంబె యోజస్సు. త
జ్జ్వలదోజస్సె కతంబు దేహబలసంప్రాప్తిన్. తదోజస్సు ని
చ్చలు మాత్రింబునఁ బో బలంబిడునె భైషజ్యంబులో భాస్కరా!

శా॥ ప్రస్తావంబున సప్తధాతువుల సారంబైన యోజస్సుఁ గా
జస్రంబుం జనకుండ నిల్పఁగల భైషజ్యంబె భక్షింపనా
విస్రంభంబున నట్లుచేసినపుడే వేగన్ బలం బబ్బు. లే
కస్రల్ గార్చుచు నెంతయేడిచినను వ్యర్థంబెకా భాస్కరా!

శా॥ స్వగ్రామంబుననుండి వచ్చునెడఁ డ్రైవరు సామీప్యమందేనియున్
చే గ్రంథంబులపేటి పట్టుకొని కించిత్తున్ గమింపంగలే
కుగ్రింబా బ్రిడిజీలనెక్కి దిగలే కుచ్ఛ్వాసముల్ విడ్చుచున్
వ్యగ్రస్వాంతుఁడనైన నాదు బలమూ పర్ణ్యం బిఁకన్ భాస్కరా!

ఉ॥ ఎత్తునఁగట్టఁబడ్డ తమయింటఁజెలంగెడు మెట్టులెక్కనే
సత్తువలేని నాదుస్థితి చక్కనెఱింగి ప్రసాదరావు తా
అత్తఱిఁ గొన్నినాళ్ళవఱ కౌషధమిచ్చి మదంగమందునన్
సెత్తురు కొంతపెట్టుటయు నిల్పినవాఁడిఁకదాని భాస్కరా!

శా॥ ఓజస్సంక్షయమున్ గుఱించి యది వోకుండం బ్రసాదించెఁ దా
రాజద్ధ్వజ మింకొకంచు సరుజారాధ్యుం డతం డద్దినే
నోజన్ వింశతిఘనప్రము ల్మైసవుపై నుద్దండమైయుండు నా
ఓజోనాశనరూపమైన గద మెట్లో నాసిలెన్ భాస్కరా! ౧౨౮

చ॥ క్రమముగ బాల్యమాదిగను గాల్మడిలోఁ జనుసప్తధాతుసా
రమును బ్రసాదరావు తన ప్రాజ్ఞతపేరిమి నాఁపినాఁడు. పూ
ర్వము గతమైనసారమును గ్రమ్మఱఁ బూరణసేయ నిమ్మెడన్
తమి నిడుచున్నవాఁడు బహుధా యగదంబులు నాకు భాస్కరా!

చ॥ నలువదియేండ్లనుండియును నష్టినిబొందుచునుండు సప్తధా
తుల బలుసారమున్ మరలఁ దోడని కూర్చు టసాధ్యమంట. వృ
ద్ధుల కిఁక నేమిచేసినను దొంటిబలం బొడగూడదంట. నీ
అలఘుతరప్రసాదమున నావ్యముగానిది యున్నె భాస్కరా!౧౩౦

ఉ॥ గోడలుదూఁక నాదుమది గోరుటలేదు. బజారులందు బల్
పోడిమనటంచుఁ బర్వులిడఁబోయి చరించెడు వాంఛలేదు. రో
చేడెలఁగూడి యాడుటకుఁ జిత్తమునందుఁ దలంపులేదు. నా
ఈడునకర్హమైనబల మిచ్చినఁజాలును నాకు భాస్కరా! ౧౩౧

చ॥ ఇఁకఁ బదియేండ్లు మందునని యెందఱొ చెప్పుచునున్నవార. లా
త్మకుఁ దమిలేని యాబ్రదుకు తద్దయు వ్యర్థముకానఁ బత్రికా
ప్రకటనఁజేసికొంచుఁ బసిబాలురఁ బెండ్లము నేలుకొంచు నే
సుకముగనుండఁగందగిన శుద్ధబలం బిడుఁ జాలు భాస్కరా !౧౩౨

ఉ॥ ఒక్క బలప్రదానమున నూఱడిలం జుమి నేను. ఎక్కడో
పిక్కబలంబు లేక యిఁక భీమబలంబును బొందిమాత్రి మే
అక్కఱఁదీర్పఁగాఁగలను. అందునఁ బిక్కపిఱుందులందుఁ బెం
పెక్కుచునున్న లాగుడు క్షయింపవలెం బ్రథమంబు భాస్కరా!

ఉ॥ పిక్కపిఱుందులందుఁగల పీఁకుడు పోకకుఁగూడఁ దానె యీఁ
డాక్టరు ప్రసాదరావు కృప నుత్తమభేషజముల్. ఫలింపదా
ఉక్కలుయత్న మింతవఱ కోజ శరీరబలంబొసంగి మున్
తక్కటి పిక్కచక్కిరహిఁ దార్కొన నుండె నతండు భాస్కరా!

ఉ॥ పిక్కబలంబె ప్రస్తుతము పేరున కేనియు లేదుకాని నా
తక్కుశరీరమం దలఁతి దార్ఢ్యముగల్గెను. దానఁ జేసి యే
ఎక్కుడుభక్తి నిన్ను నుతియించుచు నల్లిన పద్దియంబు లి
ట్లొక్కెడఁగూరుచుండి కర మోపిక వ్రాయుచునుంటి భాస్కరా!

ఉ॥ యుష్మదనుగ్రహంబు మెయి నుండవలెన్ బల మింత కాని యా
ముష్మికమో యిఁ కైహికమొ పూని లిఖింపక యూరకున్న య
స్మిష్మ దదక్షరాంబుజము. చిత్తము కాల్పనికత్వపుంగ్రియన్
భీష్మజనన్యమోఘఝరిపెల్లునఁ బోవక యున్నె భాస్కరా! ౧౩౬

మ॥ క్రియమాణంబులు కూరుచుండి యొకచోఁ గేల్దోయి చేఁ జేయు న
య్యయిచైదంబులు. కాని తక్కఁగల యయ్యంఘ్రిద్వయిం జేయనా
పయనంబాది సమస్తకార్యములునుం బాడయ్యెడిం గావునన్
దయమానుండవు నీవు కావలయుఁ దత్సంసిద్ధికిన్ భాస్కరా!

శా॥ కాలుం జేయియు నాడునంతవఱ కేకల్యాణిఁ బోషింతునం
చాలోచింపక పత్రికావిషయమం దన్నాఁడ మున్నేను. నా
కేలే యాడెడిఁగాని కాలి కకటా! కీడ్పాటు వాటిల్లె. ఇం
కేలా పత్రికనడ్పుదున్? ప్రతిన యిం కెట్లేలుదున్ భాస్కరా!

చ॥ రథకృ దధఃకృ దుద్ధురతరవ్యవహారుఁడ నైనయప్పుడున్
పృథులతరజ్వరాదిపరిపీడితకాయుఁడ నైనయప్పుడున్
ప్రథమకళత్రపుత్రులఁ బాసి దివంగతులైనయప్పుడున్
శిథిలత లేని పత్రికకుఁ జేటొనగూర్చెదె నేఁడు భాస్కరా! ౧౩౯

శా॥ చాలుంజాలు వృథాపవాదములు. నీ సత్పత్రికన్ నీవు బి
ట్లేలన్ లేక ననున్ శపింతె యన కీవేదేవు నారోగ్యదున్
గా లోకుల్ వచియింత్రొ చెప్పవలెమున్. కానం గటాక్షించి నా
కాలుం గీలును జక్కఁజేయు మెపుడుం గ్రైమోడ్చెదన్ భాస్కరా!

శా॥ కాలున్ నీవు కుదుర్పకున్న నిఁకనేఁ గావించు కార్యంబె లే
దీలోకంబున. పత్రికన్ మఱియు నాయిల్లాలినిం బిల్లలన్
బాలింపంగ ననర్హుఁడన్ సరికదా! నాకడ్పె నేఁ బూడ్చుకోఁ
జాలన్. జోలియదారి కేని వలదే సంచార మో భాస్కరా! ౧౪౧

శా॥ కించిద్దూరపుటూళ్ళలో పలి సుహృద్గేహంబు లింకంతకున్
కించిద్దూరపు గ్రామబాహ్యములె పోఁ గృచ్ఛ్రంబుగానుండ నా
సంచారంబెటు దూరదూరములకున్ సౌఖ్యంబుగా సాఁగు? ఈ
కొంచెంపున్ స్థితికన్ననున్ మృతియె మేల్ కొంచెంబిఁకన్ భాస్కరా!

మ॥ కవితాకాంత యనారతంబునిడు సౌఖ్యం బాస్థఁ గ్రైకొకయున్
స్వవధానంబులుచూపి యెల్లకడలన్ వ్యాప్తుండఁగాఁ బోకయున్
వివిధాస్థానములం జరించి పెలుచన్ విత్తాఢ్యుఁడం గాకయున్
భవసాఫల్యము పత్రికావనముగా భావించితిన్ భాస్కరా! ౧౪౩

శా॥ కర్మత్యాగులవ్రాఁతలిందు మిగులన్ ఖండించితిం బేర్చి, బి
ట్టోర్మిన్ నాగరఖండమాదియగు పెక్కుద్గ్రంథముల్ వ్రాసియున్
పేర్మిం బ్రాక్తనసత్ప్రబంధములఁగొన్నింటిన్ సమార్జించియున్
ధర్మిష్ఠంబగు దీన ముద్రితములుం గావించితిన్ భాస్కరా! ౧౪౪

శా॥ తాదృక్పత్రిక నాఁపఁగావలసె నా దౌర్భాగ్యపుం బేర్మిమై
ఈదానంగల దుఃఖ మాఁపుకొన నా కేదారి గన్పట్టు. దా
మోదం బేది సదా యిటు ల్పనపఁగా ముఖ్యంపుబీజంబెయా
పాదవ్యాధిఁ గుదిర్చి పత్రికను నం బాలింపవే భాస్కరా! ౧౪౫

శా॥ పాదాధారము లల్ల పిక్కపిఱుఁదుల్. పాదంబు నారెండునున్
మీఁదన్ లేనిది యూఁద దుర్వి. కనుకన్ నేఁ బాదశబ్దంబె యీ
బాదన్ వాడుచునుంటినంచు మదిలో భావించి వేవేగ నా
పాదవ్యాధిఁ గుదిర్చి పత్రికను నం బాలింపవే భాస్కరా! ౧౪౬

శా॥ పాదం బాది సమస్త దేహమునకున్. పాదంపుఁ గండ్లన్ వినా
ఈ దేహంబును తేరు సాఁగ దిల నొక్కం తేనియుం గాన స
ర్వాధారంబయి నాకునెప్పుడు తనూయాత్రం బ్రసాదించు నీ
పాదం బాది గుదిర్చి పత్రికను సం బాలింపవే భాస్కరా ! ౧౪

ఉ॥ శంఖమునాఁడి చెప్పెడిని శాస్త్రము లెల్లెడలన్ 'శరీర మా
ద్యంఖలు ధర్మసాధన' మటంచు సదా. అటుగాన నట్టిమేన్
పేర్ంఖితమైనపక్షమునఁ బెద్దయనర్థము సంభవించు. త
ద్రింఖణ మబ్బకుంటకె నుతించుచునుంటిని నిన్ను భాస్కరా !

ఉ॥ కాలునఁ దీఁపు. గుండె దడ. కంఠమునందునఁ గళ్ల. చక్కగా
కాలమునన్ విరేచనము గామి. సమృద్ధబలంబు లేమి. అ
ద్దాలు ధరింపకున్నయెడ దవ్వులఁ జూపులు పోమి. ఇట్టివే
బోలెడువ్యాధుఁ లిట్టిమెయి పుణ్యసుసాధనమా నె భాస్కరా !

ఉ॥ వేమఱుఁ గళ్లకళ్లయని పేర్కొనుచుంటిని నిందు నొక్కరు.
క్కామవివృద్ధియంచు గదహారులు చెప్పుచునుండ్రి దాని. త
న్నామము శాస్త్రమం దటు కనంబడుచున్నది. శ్లేష్మవృద్ధిగన్
పామరవైద్యులండ్రి. విను బాధవిధంబు వచింతు భాస్కరా !

చ॥ ప్రథమము జీర్ణకోశమును బర్వ నపక్వపదార్థ మొయ్యనన్
పృథువయి గ్రీవకెక్కి కడుబిఱ్ఱుగ గఱ్ఱను నద్దుతోడఁదా
పృథివిఁ బ్రవిష్టమావలికుఁ బీడితుఁజేయుచునుండునన్ను. త
త్కథయిది. అద్ది యెప్పుడును గల్గుచునుండును నాకు భాస్కరా !

ఉ॥ ఎచ్చటఁగూరుచుండినను నెంతటికార్యములోన నుండినన్
క్రిచ్చరనేగి యావలకుఁ గంఠగతాముముట్టె మీఁదికిన్
వచ్చుట కోరరించి మఱివచ్చుటతప్పకవచ్చె. దానినిన్
చెచ్చెర మచ్చమాపఁగదె చేతులుమోడ్చెద నీకు భాస్కరా !

ఉ॥ కండ్లు కుదుర్చుకొంటినెటో కాంచుచునుంటిని దూరగంబులన్.
పండ్లు నమర్చుకొంటినెవో. భక్షణసేయుచునుంటి నన్నియున్.
కండ్లకుఁ బండ్ల కింక నిను గట్టిగ వేడను. తక్కువ్యాధు లిం
కేండ్లనుబూండ్లు పుచ్చు కిపుడే తెగటార్చ నుతింతు భాస్కరా !

ఉ. ఎన్నిదినంబులైనయది యే నమలాపుర మేగుదెంచి? ఇం
కెన్నిదినంబులీయఁగలఁ డిట్లు మహౌషధముల్ ప్రసాదరా?
వెన్నిదినంబులుంచి తనయింటఁ బ్రసాదము పెట్టనోపు? అ
న్నన్న! అనామయంబునిడి యన్నియుఁ దీర్పఁగదయ్య భాస్కరా!

చం॥ విలువగలట్టిమందులను వేళ కొసంగుచుకాక స్వీయమహా
నిలయమునందె నిల్పుకొని నేఁటికి మాసయుగంబునుండి ని
ర్మలుఁడు ప్రసాదరావు తన మంచిని వెల్లడిచేయుచుండె. ఆ
వలఁతి సదుద్యమంబు ఫలవంతముఁ జేయఁగదయ్య భాస్కరా!

ఉ॥ రెండు నెల ల్గతించినను బ్రేముడి పెంచుచునున్నవాఁడెఁకా
తండు. రవంతయున్ విసుకు తద్ధృదయంబునఁ గల్గ. దిక్షునం
దుండెడితీపి యగ్రమునుండి క్రమంబుగ హెచ్చునట్లు ప్రా
జ్ఞుండగువాని చెల్మియును క్షోణిఁ గ్రమంబుగ హెచ్చు భాస్కరా!

ఉ॥ ఒక్కప్రసాదరావె కడుయోగ్యుఁడనం బనియేమి? తమ్ములున్
మిక్కిలిమంచివారు. బుధమిత్రము తత్పిత. అట్టివారియిల్
చిక్కెను నన్నుఁజుట్టుకొను చిక్కులుదీఱఁగ. వేయునేల? నీ
యొక్కప్రసాదమే యటుల నుత్తమరూపముదాల్చె భాస్కరా!

చం॥ తమిని ప్రసాదరావె యగదంబిడ నక్కఱలేదు. తమ్ములా
రమణయ రాజె యెక్కుడనురాగముతోడ నొసంగువార. లీ
క్రమమున మందులిచ్చుచును గమ్మనియోదన మింటఁ బెట్టుచున్
తమ సుగుణాళిఁజూపు తదుదారులు ధన్యులుగాదె భాస్కరా!

శా॥ సద్యస్స్నాత్రిగ వేదశాస్త్రములునున్ శ్రోత్రంబు సాధించి యా
విద్యారణ్యులునా వశీకృతచతుర్వేదార్థుఁడై ధాత్రి స
త్పద్యల్ తీర్చిన బుల్సుపాపయసుధీపంచాస్యుదాయాదు లీ
విద్యావత్సకుటుంబికుల్ పెరనుడుల్ వేయేటికిన్ భాస్కరా!

శా॥ ధన్యంబైమను తత్కుటుంబ మిటు నం దన్వంగనేచూడు. నే
దైన్యంబూని యిఁకెంతకాలమిటులం దత్రిత్యుఁడం గావలెన్?
శూన్యాన్యవ్యవహారతన్ మనములో శోకించుచుండన్వలెన్?
మాన్యత్వన్నుతిసేయుచుంటి నిఁక నేన్ మన్నంగదే భాస్కరా!

ఉ॥ ఒక్కనియామకృతింబడసి యుగ్మలినీ హరియింపఁగోరినన్
గ్రక్కున నీవె శుద్ధఘుటికల్ మఱి పుష్పవి? కట్లుగాక నే
పెక్కపిఱుందులందుఁగల పీఁకుడుపోకను గోరినం గటా!
ఉక్కివమూని చేత నొకయుండయుఁబెట్ట వదేమి భాస్కరా! ౧౬౧

ఉ॥ పుష్పుఁడు మేనికండలను బూర్తిగఁ గోసి స్ఫుటాగ్ని వేల్చెఁబో
దుష్పథమంచు నీవె యది దూషణఁజేసితి. వట్లుగాక నే
పుష్పసదృక్షపద్యములఁ బూజితుఁజేయుచునుంటి నిన్ను. నా
బాష్పములూడ్చి పాదరుజఁ బాపవదేల రయంబ భాస్కరా! ౧౬౨

ఉ॥ ఉండలకేమి? ఈయుఁగలఁ డుత్తమజాయువులే ప్రసాదరా.
వండగనుండెనాతఁ. డిఁక నందులకై భయమందఁ. గాని నీ
దండిప్రసాదమున్నపుడె తద్బుధుఁడిచ్చెడిమందు రోగముల్
చెందును లేదదేమొద లిసీ! ఇఁక నేమనువాఁడ భాస్కరా!

ఉ॥ దైవబలప్రవృత్తములు తామగుచుండును గొన్నివ్యాధు. ల
ప్డీవొ మఱొక్కదైవతమొ యావ దనుగ్రహదృష్టి వెట్టినన్
పోవును. లేకయున్నఁ బొరిపుచ్చుఁ గ్రమంబుగ దేహిఁ. గావునన్
తావకమా ప్రసాదమది తప్పక కావలెనాకు భాస్కరా!

ఉ॥ ఏమనుజన్మనామయము లేబలలీలఁ బ్రవృత్తమైనన్
మామకమైన పాదరుజమాత్రము దైవబలప్రవృత్త. మే
ధీమహితుండునుం దనదు దివ్యతరౌషధరాజిచేత నీ
ఆమయ మాఁపఁజాలమిదె యందులకున్నకతంబు భాస్కరా!

శా॥ దుష్టంబైన మదామయంబు సరవిం దున్మాడి నన్ బంపఁగా
ఇష్టంబైన ప్రసాదరావు తగఁడే? ఈఁడే యనేకౌషధాల్
దిష్టంబొక్కడె తక్కువైనది యిటన్. దేవుండవౌ నీవు నా
కష్టంబుం బరిమార్చి నష్టగదుఁడం గావింపవే భాస్కరా! ౧౬౬

ఉ॥ సన్నుతిఁజేసి పూర్వ మొకసన్మతి కుష్ఠగదంబునుండియే
కొన్న విముక్తిఁ గాంచఁడొకో? కష్టములొందియుఁ గొంతమంది నిన్
తిన్నగఁ బూజసేయ నవి తీరిచిపంపవు? నన్నుమాత్ర మి
ట్లెన్నినుతుల్ పొనర్చినను నేఁచనెచూచెదవేల భాస్కరా! ౧౬౭

ఉ॥ కుష్ఠమువంటి ఘోరమును గ్రూరమునై మను పెద్దవ్యాధియే
నిష్ఠ నినుఁ భజించు నవనీప్రజ డగ్గఱ. దంతకంటె న
ల్పిష్ఠము నాదుపాదరుజ. ప్రీతినడంపుము. నీదుకీర్తి బం
హిష్ఠముఁ జేయ గ్రంథమునె యే లిఖియించుచునుంటి భాస్కరా!

మ॥ కరుణన్ నీవు మదీయపాదరుజ పోకార్తైని యారోగ్యభా
స్కరమన్ పేర విరచ్యమానమగు నీగ్రంథం బగున్ సార్థకం.
బెఱుఁగంగాఁబడు నీమహామహిమ మప్డైవారిచేతన్ ధరన్.
నిరతం బిద్ది హరించి భూప్రజ యగున్ నీరోగ మో భాస్కరా.

శా॥ రెండేడుల్ గయి రెండుమాసములు నీరీతిం బడ వ్యాధికిన్
నిండెన్. మొండిజ్వరం బొకండు మఱి దానింగూడియే యుండె. ఈ
రెండబ్దంబులనుండి యెంతయును నీరెండింటికిం జిక్కి నే
బెండైపోయితి. చెండవయ్య యిఁక నీపీడన్ వడిన్ భాస్కరా!

ఉ॥ మొండిదె యౌనుగాక. జ్వరమున్ సహామూలముగం బెకల్చి వై
ద్యుండు ప్రసాదరావె. ఇఁక నున్నవి చిన్నవి కొన్నిరోగముల్.
ఖండిత మయ్యెడిం గ్రమముగా నవియేనియు. ఉండుఁగాక. ఆ
కొండికవానికిన్ జడియ. ఘోరము పాదగదంబె భాస్కరా! ౧౭౧

చం॥ అదె నను గ్రుంగఁదీసెడిని. అయ్యదియే వ్యథపెట్టెడిన్ సదా.
అదియె సమస్తకార్యముల కడ్డయి నాదు మదిం గలంచె. ఇం
కదియె కతంబు నాదు తనుయాత్రలు సాగమి. కేరికేని య
య్యదె యనివార్యమానటుల నాత్మఁ దలంచుచునుంటి భాస్కరా!

మ॥ అనివార్యంబని నేన బాధపడలే కంచుంటినిం గాని యా
ఘనవైద్యుండు ప్రసాదరావు నెదియుం గావింపకే యూరకుం
డెనె? ఇంజక్షను లిచ్చియేని యెదొమాడ్కిన్ దానిఁ బోకార్పఁదా
తనశక్తిన్ వినియోగపెట్టు నతఁ డేతన్మాత్రుఁడే భాస్కరా!

శా॥ ఇంజక్షన్ బొనరింపనెంచుటయు నప్డైందుండి యేతెంచెనో
పుంజీభూతములై మొగుళ్ళు కురిసెంబో కుంభవృష్టిన్ సదా.
నిం జూడం బదియైదునాళ్ళదనుకన్ నే నోచఁగానైతి. హా!
సంజన్ నీదునుపస్థితు ల్కనకయే సల్పంబడెన్ భాస్కరా! ౧౭౪

శా॥ మేఘాచ్ఛాదనలేక తీక్ష్ణకరుఁడై మిన్నీవది నీవుండఁగా
నా ఘస్రంబునఁ జేయఁగావలయునం టాచేయు నింజక్షనుల్.
మోఘంబౌనఁట యట్లుకానియెడ. తన్మూలంబునం జేసి యా
ద్రాఘిష్టేక్షణుఁ డాచికిత్స యునిచెం దర్వాతికిన్ భాస్కరా!

శా॥ వర్షం బించుక తగ్గి యాతపము నల్వంకల్ రహిం గ్రమ్మఁదున్
హర్షంబొంది ప్రసాదరావు మఱి నా హార్టుం బరీక్షించె. దు
ర్ధర్షంబై యట స్పంద మెక్కుడగుచుం దానుంట గన్పట్టె. నా
శీర్షంబందలి వ్రాఁతకై మనములోఁ జింతించెఁదా భాస్కరా!

మ॥ హృదయస్పందన మెక్కుడైనయపు డాయింజక్షను ల్సేయు-చో
ఒదవంగాఁగలదంట ప్రాణములకే యోజన్ మహాపద్రవం.
బదియోజించి ప్రసాదరావు మదిలో నద్దాని నట్లుంచి నా
హృదయస్పందము తగ్గుకై సలిపె ముం దేమేమియో భాస్కరా

శా॥ భైషజ్యం బిడుచున్నవాఁడు. మఱి స్వల్పంబైన యింజక్షనుల్
భూషల్ చేయుచునున్నవాఁడు చెయికిన్. పోకాడ దింకద్ది. నా
వేషం బీగతినున్న. దేమియనుదున్? విశ్వాతిశాయి త్వదు
న్మేషద్వీక్షణ మించుకంత విడు నామీఁదన్ సడిన్ భాస్కరా!

ఉ॥ ఈవిధ మాత్మవంచన మొకింతయు లేక ప్రసాదరావు నన్
కావ నొనర్చుచుండఁడొకో గట్టిప్రయత్న? మిఁకేల దీనిదా
చేవ నశింపకుండవలె? చేకురఁగావలె నిన్నివిఘ్నముల్?
దైవబలప్రవృత్తమె యిదంగద. మేటికి శంక? భాస్కరా! ౧౭

ఉ॥ దైవము నేనుగాదు. మఱి స్థాణుజనార్దనముఖ్య ముఖ్యదే
వావళి యుండియున్నదని యడ్డము చెప్పకు. నిద్రలేచి నే
నావల కేగుదేరఁగనె యత్నులలోఁబడు దేవుఁ డీవె. ప
దేవులుఁ గానరారు ప్రియతించినయేనియు నాకు భాస్కరా!

ఉ॥ స్థాణుజనార్దనప్రముఖ తత్తదభిఖ్యలె వారివారి వి
న్నాణముఁ జాటుచున్నయవి. నాపద మీగతినుండ వారి మా
గాణముగూర్చియేగు టతికష్టముగావున దేవుఁడన్న దృ
క్కోణములన్ సదా పడెడి కోణునితండ్రివి నీవె భాస్కరా!

ఉ॥ అల్పులఁజూడనేను. మహాదాశ్రయమందె వసించువాఁడ. ము
వ్వేల్పులయిక్కవంచు నిను వేడుచునుండినవాఁడ. నాస్థితిఁ
దెల్పుము నీవె వారలకు. తెల్పుదొ తెల్పకయుందొ మామకా
నల్పపదామయంబునకు హర్తవు కావలె నీవె భాస్కరా! ౧౮౨

ఉ॥ చిన్నలె యా త్రిమూర్తులన? సృష్టియు రక్ష లయంబె చేయువా
రన్నను సృష్టియుఁ లయము నక్కటె తే. దీఁక రక్షసేఁత కా
వెన్నని వేడఁబోవ నల వెన్నుని కన్నె భవత్స్వరూప. మా
కన్ను ప్రసన్నమైనఁగద కాచెడి నాతఁడు నన్ను భాస్కరా! ౧౮౩

ఉ॥ అల్ల త్రిమూర్తులుఁ లలిఁ ద్వదాశ్రయమందె వసించుచున్నవా.
రొల్ల నిఁకం దదాశ్రితుల యొద్దకె పోయి సమాశ్రయింపఁగఁ.
త్వల్లలితాకృతిఁ మదిని దద్దయుఁ జేర్చి సమాశ్రయించెదఁ.
తెల్లము. నాదుపాదరుజ తీర్పకతప్పదు నీకు భాస్కరా!

చం॥ ఇఁకనొక నేన మెప్డు భవదీక్షణగోచరుఁ డౌటలేదు. పా
వకముఖ పంచభూతములు భప్రభు భౌమ బుధేజ్య శుక్ర మా
మకసుత ఋక్షముల్ నయనమార్గమునం బడుచుండునంచు వే
ల్పొకనుడి యాడెదేని విను ముత్తరముఁ వచియింతు భాస్కరా!

శా॥ భాగ్యంబాదిగఁ దత్తదర్థములనే భక్తాళికిం బ్రీతి నీ
యోగ్యుల్వారు. మదీప్స్యమానమును నం దొక్కండు నీ లేఁడు. నే
రుగ్యుక్తుండ. అనామయార్థిని. తదారోగ్యంబు నీదివ్య. మా
రోగ్యం భాస్కరయఁ బుధోక్తి మనదే రూఢంబుగా భాస్కరా!

శా॥ ఇట్లారోగ్యదుఁడన్న ఖ్యాతి భువి నీకే కల్గియుండంగ నిం
కెట్లర్థింతుఁ ద్రిమూర్తులఁ మఱియుఁ జంద్రేంద్రాదులన్ దీనతన్?
పోట్లాడన్ గమకించెకాని గదుము బోకార్పఁగం జూడ వె
ప్పట్లన్. నా గ్రహచారమా యిది? ఇఁకం బ్రారబ్ధమా భాస్కరా!

మ॥ గ్రహనాథుండవు నీవె యౌదు. కనుకం గావింపఁగాలేవె ని
గ్రహమున్? తద్గ్రహచారముం గుదురుపంగా లేవె? అత్యంతదు
స్సహమైయుండెడి నాదు పాదరుజ యీమచ్ఛేషమున్ లేక యే
వహి నాశిల్లునొ యావహిన్ సలిపి పోవన్ లేవె? యో భాస్కరా?

ఉ॥ స_ప్తమమైన మేషమునఁ జంద్రియుతుండయి యుండె రాహుఁ వి
ప్తాప్తము తన్మహాదశయె. ఆదశయాదిని గల్గె వి_త్తసం
ప్రాప్తి గయాప్రియాగమనాదిశుభంబులు. కాని దీర్ఘసం
సు_ప్తినిజెందెఁ దాఁటిసతి. శోకము చి_త్తముఁ జందె భాస్కరా!

చం॥ స్థితుఁడు కళత్రమం దతఁడు. చేసెను జేయఁగఁదగ్గ కార్యముల్
దుత్రిమగ వెండి పెండిలియుఁ దోడనె పెండిలియాడఁబడ్డ యా
పతిరతయందు సంతతియుఁ బుటవలంతియుఁ గూర్చెఁ గాని యా
స్థితి స్వదశావసానమునఁ జేకురఁజేసె నదేమొ భాస్కరా! ౧౯౦

ఉ॥ నిర్దయుఁడై విధుంతుదుఁడు నిన్ను గ్రసించుచునుండుఁగాన నా
దుర్దమువూ టటుంచుము. చతుర్థనిజాలయవ_ర్తియయ్యు సౌ
హార్దముఁజూపఁడయ్యె భవదాత్మజుఁడౌ నసితుండు. వాని యం
తర్దశయే మదార్థికమునన్ విషమించె నొకింత భాస్కరా! ౧౯౧

మ॥ అలరాహువుడు కళత్రవ_ర్తియగుటల్ స్వాంతర్దశావేళలో
సలిపెం దాను గళత్రమారణ. మిఁకేసంతాపముంగూడఁదా
కలిగింపం. డటుపైఁ ద్వితీయపతియై కన్యల్ వ్యయంబుందె వ
_ర్తిలియుల్ గీష్పతి మేలెచేసిచనె. తద్భిఁజూడు మో భాస్కరా!

ఉ॥ వచ్చె భవత్సుతుండు నటుపైని. సుతాధిపుఁడౌటఁజేసి తా
ఇచ్చె సుతుల్. నుతింపవలె నిందుల కాతని. కాని యెంతయున్
హెచ్చు మదార్థికంబునకు నించుక మాంద్యము తెచ్చిపెట్టెఁ బో
ఇచ్చపడెన్ స్వమాంద్యమునె యెల్లెడ నుంచ నతండు భాస్కరా!

మ॥ అదియేమాంద్య మిఁకింత హెచ్చినది సౌమ్యాంతర్దశన్. తద్బుధుం
డదయుం డయ్యెను భాగ్యనాథుఁడయి రాజ్యంబందు వి_త్తేశుతో
డాదవన్ వ_ర్తిలికూడ. లాభపతి పీవున్నాఁడ వచ్చోట సం
పద నిప్పింపఁగ లేకపోతి హితుచే. భావ్యంబొకో భాస్కరా!

మ॥ ధనలాభేశులతోడ రాజ్యగతుఁడౌ తత్సౌమ్యుఁడే యెంతగా
ధనముం గూర్పకయుండెఁ గేతువె యిఁకందాఁగూర్చువాఁ. డాతఁడు
న్దనుభావస్థుఁడు. దానఁజేసి తనువే తద్దృష్టులన్ మున్ బడెన్.
తనుసౌఖ్యంబు హరించె. వేఁకిమొలకన్ స్థాపించెఁబో భాస్కరా!

శా॥ ఆక్రూరుం డదొ చేసినాఁడు. చనినాఁ. డామీఁద నాయాతుఁడా
శుక్రుండే పడఁద్రోసెఁ బూర్తిగ ననుం జూ. భార్గవుండాట జా
తక్రోధుండయి యుండఁబోలు నిటులం దా. అష్టమాధీశుఁడా
ఈక్రవ్యాద్గురుఁ డింత కెక్కుడు శుభం బీనేర్చునే భాస్కరా! ౧౯౬

ఉ॥ శుక్రున కష్టమాధిపత జ్యోతిరభిజ్ఞులు కాదు దోషమం.
దేక్రమమన్యొ దోషి యిఁక? ఏఁగవిఁ దాఁగవియా యటంచు నక్
సక్రుధుఁడై కనంగనగు. సాగ్రహ మాగ్రహ మాచరించు నీ
అక్రమ మాఁపఁజాలవొకొ వైగ్రహరాజపుకూడ భాస్కరా!

చం॥ ఎవరు స్వజాతిపట్ల వహియింత్రభిమానము. గాన నల్లె తా
కవి కవికిన్ సహాయపడఁగాఁ దగియుండ నిటుల్ రచింపఁ గా
కవిత నితండు. కాకవియుఁ గాంచు స్వజాతిని బ్రీతితోడ. ఈ
అవని స్వజాతివైరు లొకయా భషకంబులెకాదె భాస్కరా! ౧౯౮

చం॥ ద్విజులకు జాతివైరమది తీఱక వర్తిలుచుండు నెంతయున్.
స్వజనము నాక యోరుపులు స్వాంతమునందున లేక యొండొరుల్
విజితులఁజేయుపొంచుఁ గల వేరము పెంచుచునుంద్రు. కాన నీ
ద్విజుఁడు ద్విజుండనైన నను ద్వేషమునం గనఁబోలు భాస్కరా!

మ॥ తనుభావేశ్వరుఁడౌచు లాభమున నే తానుండుచున్ నాకుఁ ద
త్తను సౌఖ్యాదికలాభ మీక తనువే తార్మారు గావించెడిన్.
తనుజాతాంతరలాభకృత్త్వ మొకమేల్ తప్పన్ విచారింప నీ
తనికావించిన వేఱుమేలు గలదే తథ్యంబుగా భాస్కరా! ౨౦౦

ఉ॥ కాలికి నొప్పిగూర్చె. అది కాల్కదలింపక యుంచనేర్చె. సు
శ్రీలవిధంబు మార్చె. జ్వర శేషము పీడనిలా గొనర్చె. పా
పాలకు నెల్ల భైరవుఁడు భార్గవుఁడన్నను. అట్టి క్రూరుఁ డా
మేలొ శుభగ్రహంబుగను నెంచెడి జ్యోతిషికాళి భాస్కరా!

మ॥ స్వదశారంభమునుండి యీతఁ డిటులే సౌఖ్యంబు పోకార్చి క
ష్టదశల్ తారుచుచున్నవాఁడు. గడచెన్ సంవత్సరద్వంద్వ మా
కుదశన్. వత్సర మింకనున్నయదియున్. కోణుండు త్వత్సూనుఁడే
విదశానాథుఁడు ప్రస్తుతంబు. శుభమున్ వేకూర్చవే భాస్కరా!

చం॥ గ్రిహాపతివాట నీమనుడి కాదనఁడాతఁడు. తండ్రి వింక. తా
సహితము యోగకారుఁడుగ శాస్త్రవిదీరితుఁ డట్లుగాన నా
కు హితము సేయుపొంటె ననుకూలము కాలము. వేగఁ బాదరు
గ్రిహితుని జేయుమంచుఁ గృప గట్టిగఁ బట్టికిఁ జెప్పు భాస్కరా!

ఉ॥ వృద్ధిదిగ్గైనయెద్దు పసికోయనిచేనునఁ బడ్డరీతి నీ
వృద్ధియు నేఁగుచుండె. నషుఁ గుందఁగఁ జేయుచునుండె. కాన మా
జోడ్డి మదీయపాదరుజ యోజ నశింపఁగఁ జేయుమయ్య నీ
బిడ్డకుఁ జెప్పి యీ విదశ. ప్రేముడిఁ జూపఁ గదయ్య భాస్కరా!

మ॥ పగవాఁడైనను నీదుక్షేత్రిమగు నా పంచాస్యమందేకదా
పగముంజచ్చివసించుచుండెఁ గవి తా. సంబోధ్యమానుండుగా
మొగమీయంగలఁ డప్డెనీకు. కనుకన్ బోధించి యెట్లేని నీ
పిఁగ నన్నేఁచకయుండఁ జేయఁగదవే యేమ్రొక్కెదన్ భాస్కరా!

మ॥ మునుపే ముక్కిడి పైని దగ్గుపడిసెమ్ముం గల్గెనన్నట్లు నా
ఘనపద్వ్యాధికిఁదోడు ప్రస్తుతమునం గల్గెన్ శిరోవ్యాధి. నె
మ్మనముల్ నీపయిఁ జేర్చి సంతతమునుం బద్యంబులం జెప్పు చీ
పెనువ్యాధిం గొనితెచ్చుకొంటి నెపుడుం బీడింప నన్ భాస్కరా!

ఉ॥ అద్దమరేయియైనను రవంతయు నూఱటఁ జెంద దింతయున్
నిద్దురపట్టనీదు మది. నిద్రయొకించుక పట్టినం గలన్
పద్దెములన్ రచించుపని మానదు. వేసర దించుకేని. నా
హృద్దశ యిట్టులున్నయది. ఏమగునో యిఁక దీన భాస్కరా! ౨౦౭

ఉ॥ పంచదశాబ్దమందె ననుఁ బట్టెఁ గవిత్వపుభూత. మెంతయున్
సంచలనంబుగూరిచె మనంబున. కార్యులు మెచ్చునట్లు వ్రా
యించెను బెద్దగ్రంథములె. ఎన్నఁడెఱుంగ శిరోభరంబు. ని
న్నెంచిరచించుపద్యముల నిట్లుఘటిల్లె నదేమొ భాస్కరా! ౨౦౮

శా॥ తానంబుం బొనరించుపట్ల మఱి సంధ్యావందనప్రక్రియన్
బోనంబుం దినువేళఁ బండుకొనినప్డున్ శౌచవిధ్యాదులన్
దానన్ దీన ననంగనేల యెపుడుం ద్వత్పద్యసంధానమే
ధ్యానంబైనది నాకు. ఏమియగునో తర్వాత నో భాస్కరా! ౨౦౯

మ॥ అకటా! ఈగతి సర్వకాలముల సర్వావస్థలంగూడఁ దా
వకమా ధ్యానము చేయుచుండినను మత్పాదస్థమా వ్యాధి యిం
చుకయుం దక్కువసేయ వేమనుదు? నాశోకంబుఁ జల్లార్చ, నీ
వికృతవ్యాధి యిఁకెంతకాల మిటు నన్ వేఁచన్ వలెన్ భాస్కరా!

చం॥ పవలును రేయి నీపయిని బద్యములల్లుచు నేను నాదు స
త్కవితను వ్యర్థపుచ్చుదనుగాక, సదా యిటు స్తూయమాను నీ
రవిత సహార్థమయ్యెడిని. రక్షణసేయక యుంటివేని నీ
వవుదువొ కావొ ధూతబుణుఁ డయ్యది యోజనసేయు భాస్కరా!

మ॥ రవియుం గాంచని యబ్ధిపర్వతగుహారణ్యాదులంగూడఁ దా
కవి గాంచంగలఁడన్ జనశ్రుతి భవత్కర్ణప్రవిష్టంబుగా
కవిలంబంబుగ నాదు పాదరుజ నీ వంతంబునొందింప వే
వివరింతుం దృవదఃప్రవృత్తియుచరన్ వేర్వేఱుగా భాస్కరా! ౧౧౨

మ॥ కవితారూపముగా ననుక్షణమునుం గావించుచున్నాఁడ నే
భవదీయంబగు ధ్యాన, మైనయవియుం బద్యంబు లిన్నాటిపై,
దవులందోయవు నాదుపాదరుజ, నీదాక్షిణ్యమేమందు? ఇ
య్యవియేయానొకొ ధ్యాయమానకరణీయప్రక్రియల్ భాస్కరా!

మ॥ ఇది తత్కార్యము కాకవచ్చినది కానీ నేను బ్రార్థింపఁగన్
హృదయంబందున ధ్యాయమానులగుచో నేదేవతల్ ధ్యాతృకా
మదుఘుల్గారు తలంప ? కష్టములఁదా ర్మన్నించిపోకార్ప ? రా
పదలం బాపెడివాఁడె దేవుఁడును సంప్రార్థ్యుండునున్ భాస్కరా!

చం॥ అభయకరం బొసంగుమని యర్థనఁజేయుచునున్న నాపయిన్
రభసమునన్ సహస్రకరరాజి నిగుడ్చెదు. మాడ్చెదే? మహా
ప్రభువని యాచ్న చేసితిని భ్రాంతి, కటా! ఇటులౌటెఱుంగ, నీ
ప్రభ వెలిగింప కన్మదురుపద్రుజ మాన్పు మిఁకేని భాస్కరా! ౧౧౫

ఉ॥ ప్రార్థితుఁడైన సత్ప్రభువు ప్రాజ్ఞులఁ జేర్మి బహూకరించు, అ
భ్యర్థితుఁడౌ సదర్థి వెస నర్థుల కర్థము లిచ్చిపుచ్చు, సం
వర్థితుఁ డొందు దేహియనువానికి నాస్తియనండు, నీవె నా
ప్రార్థన వ్యర్థపుచ్చుటకుఁ బాల్పడినాఁడవు నేఁడు భాస్కరా! ౧౧౬

ఉ॥ ఆరయ దేవవైద్యులు త్వదాత్మజులేకద యాశ్వినేయు. ల
వ్వారలు నాదుపాదరుజఁ బాపఁగలారలు కానఁ బంపు మ
వ్వారల నీవు. మున్ జ్యవను వార్ధకమూడిచి కన్నులిచ్చియున్
మారశరీరుఁ బున్పసుకుమారు నొనర్పరె వారు భాస్కరా! ౧౧౭

ఉ॥ కం టిటువంటి యజ్ఞభు గ్ఖర్వభిమన్యుల రోగధన్యులన్.
కంటివి శిష్టదుష్టులను గాచఁగ నేచఁగ దక్షుఁడౌ యమున్.
కంటివి దుష్టసుస్థుఁడయి కాల్చను దేల్చను శక్తుఁడౌ శనిన్.
కంటి జగత్పవిత్రిధుని. కంటి ననుం గడగంట భాస్కరా! ౧౧౮

ఉ॥ అంత జగన్నియంతలు కృతాంతపురోగము లాత్మజుల్. రమా
కాంతకు సంతతంబు నిలుగట్టెడి పద్మిని యింతి. ఇంత శ్రీ
మంతము నీకుటుంబ మణుమాత్రిము భక్తజనాళిపైఁ గృపా
వంతముగాక పోవుటకె వంతపడన్ వలెఁగాదె భాస్కరా! ౧౧౯

ఉ॥ కర్ణుఁడునున్ భవత్సుతుఁడెకా! సుతు నీగి పితన్ భజింప ను
త్తీర్ణుఁడనౌచునుంటిని నదీనిభ పద్రిజనుండి. మానుషా
కీర్ణముగాని త్యాగమున ఖేచరులెల్లను దద్వితీర్ణమున్
పూర్ణముగా భుజించుట కెపో. ఇఁక దేనికిఁగారు భాస్కరా! ౧౨౦

చం॥ అకట! దధీచి వేలుపుల కస్థు లొసంగఁడె? చర్మసన్నిభ
స్వకవచకుండలంబులను శక్రున కీయఁడె కర్ణుఁ? డింక జం
కక శిబి కోసియీఁడె మెయికండలు బోయకు? ఎంచిచూడ నిం
చుకది యనామయం. బొసఁగఁజూడవు దానినె నీవు భాస్కరా!

ఉ॥ ఆత్మజు నర్జునున్ మనుప తాన్ కొమరవేషము దాల్చి వజ్రి నీ
ఆత్మజుఁడైన కర్ణునకు నాయువుపట్టగు వర్మముం గడో
రాత్ముకుఁడై హరించె. బలి నట్టులె చక్రియు మోసగించె. శు
ద్ధాత్ములు దేవతల్. మఱి తదర్థ మదేమొ యెఱుంగ భాస్కరా!

చం॥ తనపగవానిఁ జంపుటకుఁ దగ్గ సుసాధన మబ్బునంచునే
అనుకొనెఁగాని యిందుఁడు మహర్షి బలాత్కృతిఁ జచ్చిపోకమున్
మనమునఁ గుందఁడయ్యె నణుమాత్రి. మెవం డెటులైన స్వీయపున్
ఖను లగుచే ప్రిధానము సుపర్వుల. కేమననౌను భాస్కరా! ౧౨౩

శా॥ కాళ్లం దీఁపు బలంబులేమియొ సదా కారించెడిన్ నన్నుఁ. ఎ
న్నాళ్ళో నైనది యివ్వియేరుపడియున్. ధర్మప్రచారార్థమై
ఊళ్ళున్ వీళ్లు చరించుచుండెడిది నాయుద్యోగ. మట్లాటచే
కుళ్ళుఁజేయు కనామయంబు సరవిం గూర్పంగదే భాస్కరా! ౧౧౮

శా॥ కర్మభ్రష్టులు దుష్టశాసనములం గల్పించుచున్నార. లా
కర్మం బాఁగి స్వధర్మమున్ నిలుపనా కాలఁబుచూ యుద్ది. శ్రీ
ధర్మాచార్యుల యాజ్ఞ బైల్వెడలె విద్వచ్ఛ్రేణి యద్దానికై.
కూర్మంబై గృహకూపమందు మను నా కుందార్పవే భాస్కరా!

చం॥ ఇరువదియాఱువత్సరము లే నొకపత్రిక నప్పుచున్ నిరం
తరకృషి సేసియుంటిఁగద ధర్మముఁగూర్చియె. అట్టిధర్మ మే
దురితులో సంస్కరింతుమని దూఁకుల పెట్టెడిచోఁ బ్రతిక్రియన్
జరుపఁగఁజాలునంత బలసంపద యీయకపోతి భాస్కరా! ౧౧౯

శా॥ విద్వత్సంఘ ముపన్యసించునవి వెన్వెంటన్ రహిన్ వ్రాసి య
స్మద్వైదుష్య మొకింతఁ జేర్చి యచటన్ మాసంబుమాసంబుఁ ద
ద్విద్వద్వ్యాసము లెల్లదేశములలో విఖ్యాతముల్సేయునన్
వైద్వైకల్యముతోడ నుండుమనుచున్ బాధించెదే భాస్కరా!

మ॥ గురుఁడౌ పండిత రామకృష్ణచయనుల్ క్రొంబువ్వటుల్ సన్మనో
హరుఁడౌ వేంకటరామశాస్త్రి మొదలౌ నాయాయి విద్వాంసులం
దఱితో నేనును దేశదేశములలో ధర్మప్రచారంబులన్
జరుపన్ రానటు కాలితీఁపౌక డిటుల్ సంధించెదే భాస్కరా!

శా॥ రుగ్బాధాకలితప్రతీకయు గిదం లోకోపకారిప్రజా
రోగ్యశ్రీదముగాని తావక బృహద్రూషంబు భాగ్యంబు కిం
భోగ్యం బుర్విని గంటకావృతఫలాపూర్ణామ్రముంబోలె. ఆ
రోగ్యం భాస్కరయన్నవాక్యము వృథావాదంబుగా భాస్కరా!

శా॥ కాళ్ళం బడ్డది పా. మిఁకం గఱవకే కాల్జర్వ దొక్కింతయున్.
గోళ్ళం జిమ్మెడిదాని నెందులకుఁగా గోడ్డండ్రిచేఁ జిమ్మ? దే
రోళ్ళన్ రోకళులం ద్వదీయమగుపే ళ్ళాళ్ళాళ్ళఁ బాడింతు. నా
కాళ్ళం గీళ్ళఁ గుదుర్పు మేటి కిటులం గైలాటముల్ భాస్కరా!

శా॥ ఇచ్చోఁ గుండెదడం గుదిర్చి మఱి మూర్ఛింజత్తుచు ల్పాగ చూ
సచ్చిత్తుండు ప్రసాదరావు. లవముఁ జాఘామయుం బాఁగ. దే
నెచ్చో నేగుదు? ఏమి సేయుదు? కటా! ఎవ్వారిఁకఁ దిక్కు? నీ
హెచ్చెల్లం దెలియంగవచ్చినదిలే యీనాఁటికిఁ భాస్కరా!

చం॥ ప్రతినయొనర్చె నాదు పదబాధను మానిపిపుత్తునంచు సు
ప్రతుఁడు ప్రసాదరావు. తన వైద్యత కించుక త్వత్ప్రసాదముఁ
జతయుటయుండ భాస్కరుని సన్నుతిసేయుచు నొక్క పద్యపుఁ
శతకము వ్రాయుమంచుఁ బెలుచం బురికొల్పెను నన్ను భాస్కరా!

ఉ॥ నమ్మఁగలేకపోతి నిను. నామది త్వాదృశదేవతాసమూ
హమ్మెటువంటిదైనది యథార్థ మెఱింగియుఁ దత్ప్రణీత బా
క్యమ్ముగ్న భ్రాంతమై మరల నందుఁ బ్రవిష్ట. మింకద్ది యెన్నిప
ద్యమ్ములనల్లునో. శతకమయ్యె మఱొక్కటియయ్యె భాస్కరా!

చ॥ మఁగిసెఁ బ్రసాదరావుకని ముమ్మకుమీఁదికినెత్తె బల్మిఁ ద
ద్రగతిశయమ్ము. నీరుదిగి తొల్లిటికంటె నొకింత భారమై
అగుపడుచుంటఁ జెప్పుటయు నయ్యది హేతువుకాదు కాలిదా
తెగులునకంచుఁ బల్కె మును. తెల్పెనిటీప్పు డతండు భాస్కరా!

ఉ॥ బుడ్డను నమ్మ యేటఁబడుపోల్కి విశాఖపురింగరంబు పే
ర్పడ్డది యాసుపత్రి. అటఁ బాలునరొట్టెయు వారెయిచ్చి యీ
బుడ్డనుగోసి నీర్దిగిచిపుత్తురనేఁ మఱి. అద్ది గుండెపై
పెడ్డను గొట్టినట్టులయి భీతిలితిం జన నందు భాస్కరా! ౨౩౫

ఉ॥ భీతిలి యింటికిం జనితి. పెండ్లము బిడ్డలఁ జూచుకొంటి. నా
వ్రేతకుఁ గుంది యందుఁ బదివాసరముల్ వసియించి వెండియుఁ
భూతముచాష్పనం బయికిఁబొంగిన వేఁడిమి నాఁపివేయ నే
చేఁతయుఁ జేయలేక కడు క్షీణబలుండను నైతి భాస్కరా! ౨౩౬

ఉ॥ ఈగతి లేవలేకయును నింతిని బిల్లలఁ దోడికొంచు నే
నేగితి నర్సరాట్పురికి. ఇంతటిక్షీణబలుండ వండ మే
లాగునఁ జీలిపించెదని లావుభయంపడు బంధుసంచయం
బాఁగి ప్రవిష్టుఁడైతిఁ దుద కాంగ్లభిషగ్వరశాల భాస్కరా!

మ॥ ఉరికంబంబున నిల్పవేదికయి వధ్యుండట్లు నేనయ్యెడన్
కలకుంగత్తుల యాపరేషనుగదిం గాల్వెట్టుడున్ వచ్చి ర
క్షింపు డ్డాక్టరు. లిచ్చిరంత స్మృతిపో నేమందొ తత్సత్త్రచే
ఎఱుఁగన్ రాకెది నిద్రపట్టినటు లయ్యెన్ నా కహో భాస్కరా!

ఉ॥ కోయఁగ నా ప్రతీకమును గోసి ప్రమాదము లేక కొంతయున్
తీయఁగనైన నీరమును దీసి స్వకీయపు నేర్పుకల్మిమై
చేయఁగనున్నదంతయును జేసి క్రమంబుగ వార లావలన్
పోయిరి తెల్వి లేనినను భూశయనంబునఁ జేర్చి భాస్కరా! ౨౩౯

ఉ॥ భూశయనంబునన్ గడియ పొద్దు చలింపకయున్న నాదుపై
ఆశదొలంగెఁ జుట్టలకు. హాయనుచుండిరి. కాని యింతలో
క్లేశములొందువార లిల లేరని కన్నులు విప్పి చూచితిన్.
దేశము గొడ్డుపోవదొకొ నే ధృతజీవుఁడనైన భాస్కరా! ౨౪౦

శా॥ ఈ యారోగ్యవిహీనతం గుడుచువారెవ్వారు? దారిద్ర్యమున్
మోయంగాఁగలవారలెవ్వ? రిడిమెంబో నాకుఁ దద్బ్రహ్మ దీ
ర్ఘాయుష్యంబు. ననర్థితుండతఁడు తా. ఆరోగ్యముం గూర్చి యెం
తో యభ్యర్థితుఁడీ. వటయ్యు నిడ పోహో దాని నో భాస్కరా!

ఉ॥ ఆవిధి ధాతయిచ్చిన చిరాయువు గల్గుటఁ జేసి యెంతయున్
చేవదొలంగియుండియును జీవముఁ బాయను నేను. వెండి ఛి
న్నావయవంపుఁ జర్మమది యల్లుకొనెన్ దివసాష్టకంబులో.
పోవఁగనయ్యెఁ దద్వికృతి. పూర్వపుటాకృతివచ్చె భాస్కరా!

మ॥ చనితిం గాల్నడతోడఁ బంచదశఘస్రంబందునన్ బాగుచే
సిన యాడాక్టరునింటికి. కాయన కడున్ శిష్టుఁ. డసిష్టాంటుస
ర్జను. మధ్వావనిదేవవంశజుఁడు. పేరన్ మాధవాచార్యుఁ. డా
ఘను కారుణ్యముకల్మి నింతటొరగా గట్టెక్కితిన్ భాస్కరా!

ఉ॥ ఆవిషయంపులోపమది యంతయుఁ దీరెను గాని కాలితోఁ
పావిధిగానె యున్నయది. అండగ నీరమె మూలమైనచో
పొవ్రచునుండె నట్టియది. పోవదు కావున నుష్ణమూలమం
చేవియొ మందు లీఁగడఁగె నింకను డాక్టరు నాకు భాస్కరా!

శా॥ ఎన్నాళ్లుండుదు మందుదించు నొకచో ? ఏఁ భాగ్యవంతుండనా ?
ఎన్నం బుట్టుదరిద్రుఁడన్. శిరముపై నెంతేని భారం బొకం
డున్నట్లుండను. ఖత్రికన్ నడపు టాయున్నట్టి భారంబు. దా
ని న్నే నాఁపను శక్యమైనవఁటకున్ నేసుంబుగా భాస్కరా! ౨౮౫

ఉ॥ ముందుల మ్రాఁకులం గరము మామక మానసముం ము రోఁత ప్రు
ట్టెం దుద. కొన్ని మందులో యిడెన్ భిషగాఘు. ననామయంబు పే
ర్మిం దయసేయు దీవనుచు మిక్కిలియాశను నిన్నుఁగూర్చి నే
వందలపద్యముల్ రమణ వ్రాసితి. రోసితి లోన భాస్కరా! ౨౮౬

ఉ॥ ప్రాక్కృతకర్మ మాఁగఁగల ప్రౌఢిమ వేల్పులయందు లేదు. స
మ్యక్కృతమైన యౌషధములందును లేదు తలంప. మాయచే
ధిక్కృతులౌచు భూజనులు దీనినో దానినో మొక్కి రాళ్ళకున్
మ్రొక్కి వ్రియప్రయాసలను బొందుచునుందురు వృథాగ భాస్కరా!

చం॥ అశుభ మొసంగుచుండెనని యూరయుకుండనె శుక్రుఁ దిట్టితిన్.
ప్రశమితబాధుఁ జేయుఁగదె భాస్కర! నన్నని దీనతన్ భవ
ద్వశము ననేకథా పొగడి నైతిని వ్యర్థుఁడ. నాని కర్మమే
కుశలము దేనికిన్. పరులకున్ ముడిపెట్టుట భ్రాంతి భాస్కరా!

చం॥ కనుక శుభాశుభంబయిన కర్మ మవశ్యము ప్రాణికోటిచే
అనుభవితవ్య. మయ్యది యథార్థము. దీని నెఱింగియుండియున్
మన మతిచంచలంబగుట మార్గముదప్పితి. నీదుసంస్తుతుల్
పొనరిచియుం బొనర్చి విఫలుండనె నైతిని నేను భాస్కరా! ౨౮౯

శా॥ భోగింపన్ వలె నాశమొందవలె నెప్డుం గూడఁ బ్రారబ్ధ. మే
ఆగం బెవ్వరికేను జేసితినొ మున్నద్దానికిన్ మాఱు ప
ద్రోగం బిట్లు కలంచుచున్నయది. ఆరోగ్యంబు తద్దుష్క్రియా
యోగంబుండినదాఁక గల్గ. దది యొప్డో నాకిఁకన్ భాస్కరా !

ఉ॥ అక్కట ! న్యాయనిష్ఠురము లాడితి నిన్ను గుఱించి. చేసితిన్
వ్యక్కృతి. ఆమయార్దితుఁడనై యిటులంటి. క్షమింపుమంటి. పై
మ్రొక్కుచునుంటి. అన్యులకు మ్రొక్కిన మ్రొక్కకయున్న నీకు నే
మ్రొక్కక తప్ప. దన్వహము మ్రొక్కనె సంధ్యలయందు భాస్కరా!

శా॥ సంధ్యావందనమద్ది మామకనమస్కారంబు గాదందువేన్
సంధ్యాదేవత తత్త్వరూపిణియె. చిచ్ఛక్తిం ద్వదాకారఁ ద
త్సంధ్యన్ వార్వమి శూద్రుఁడై శతజనుశ్చంచాలుఁడౌ బ్రాహ్మణుం
డాంధ్యంబూని త్యజించుచుండెనతఁడి ప్డాకర్మమున్ భాస్కరా!

ఉ॥ కావునఁ గష్టమున్ సుఖముఁ గర్మఫలంబులె యైనను ద్విజుల్
తావక సేవ సేయుటది తప్పదు. నేను ద్విజుండ. శాస్త్రపున్
తోవఁ ద్యజింప నక్షముఁడ. తొట్రిలకుండఁ దదధ్వమందునన్
పోవఁగ లేమికిన్ మదిని బొక్కుచునుండెడివాఁడ భాస్కరా! ౨౯౩

ఉ॥ స్వప్రతిభానుసారముగ శాస్త్రవిధిం ద్యజియించి వర్తిలన్
భూప్రజ కున్నె సిద్ధి? మఱి పొందునె సద్గతులన్? సుఖించునే?
విప్రుఁడు గూడ నేలో కలివిస్మృతి నియ్యెడఁ గామకారతన్
సుప్రథితత్త్వముం బొరయఁ జూచుచునుండినవాఁడు భాస్కరా! ౨౯౪

శా॥ కాలం గీల్కొను చచ్చుతీఁపు త్రిశరత్కాలానకుంగూడఁబా
మూలచ్ఛేదముగామిఁ జేయవలసెంబో కర్మవాదంబు లి
ట్లోలిం జాల శమించె నయ్యదియు. ఆ యుద్యంతమస్తంయమన్
మేలా వేదపుముక్కచిక్కనది. మేల్! మేలింకనౌ భాస్కరా! ౨౯౫

మ॥ ఉదయాస్తాద్రులమీఁదనున్నయపు డాయుష్ణాంశు ధ్యానించు కో
విదుఁడౌ బ్రాహ్మణుఁ డొందు సర్వశుభముల్ వేడ్కల్ పిసాళింపనం
చదిరా యాశ్రుతి చెప్పుచున్నయది. ఇం కాతీరె ధ్యానింతు. నా
పద మానెప్పటియట్లు. తక్కు తెగుళుల్ బాధింపవో భాస్కరా! ౨౯౬

మ॥ ఒకయారోగ్యమె యిత్తువీవనెడి యార్యోక్తిం గనుంగొంటిమున్.
సకలం భద్రమటంచు నీశ్రుతి యనుంగా! నీయుపస్థానమం
దిఁక మేలైన నహాన్యతే పరిభృతు లెన్నేనిన్ భవద్దీయమా
న కళారోగ్యచిరాయురాదికముల న్గాన్పించెడిన్ భాస్కరా! ౨౯౭

శా॥ ఆ క్రివ్యాద్గురుఁడబ్దపుందరియము నన్నర్థానఁ బ్రాణాన దుః
ఖాక్రాంతుం బొనరించినాఁడు. చనినాఁ డంతర్దశానాథుఁ డీ
వై క్రిల్కాలముగూడనైనయదియు. ప్డారోగ్యమున్ భాగ్యమున్
నీ క్రీగంటనుజూచుమాత్రఁ గలుగున్ లేనాకిఁకన్ భాస్కరా!

శా॥ ఆరోగ్యంబును గోలుపోయి యొకమూడబ్దంబులున్ నీస్తుతిన్
ప్రారంభించి యొకబ్దముం గడపఁగానయ్యెన్. కృతాచారసం
స్కారుండైన పరాశరుం డనె "కలౌ సంవత్సరే" యంచు. నీ
కారుణ్యంబున రోగవర్జితుఁడనేఁ గానే యిఁకన్ భాస్కరా! ౨౫౯

శా॥ నాయారోగ్యముఁగూర్చి నేను నిను దైన్యంబూని కొండాడుటల్
న్యాయంబా టటులుండ నాదు హితులున్ నన్ గూర్చి నీస్తోత్రమున్
చేయంబూనిరి. వారికోసమయినన్ శీఘ్రంబుగా నాయెడన్
నీయౌదార్యముఁ జూపు. కాదు నిఁక నేన్ నీరోగుఁడన్ భాస్కరా!

ఉ॥ ధీయుతుఁడున్ బిషే యవనిదేవుఁడు సత్కవి యైన రామసు
బ్రాయుఁడు నస్మదర్థమయి రాఘవుమీఁద ననేకపద్యముల్
వ్రాయఁగడంగినాఁ. డతని వ్రాఁత లతండు ననేక థా వృథా
చేయఁడనామయంబునిడు. శ్రీయునుగూర్చెడి నాకు భాస్కరా!

చం॥ అతఁ డతిభక్తితోడఁ గవితాతిశయంబును జూపి జానకీ
పతిశతకంబునుం దనదు పట్టికి భార్యకు నాయు విచ్చి పో
చుతమని వేంకటేశ్వరుని స్తోత్రము సేయుచు నింకనొక్కఁడౌ
శతకము వ్రాసినట్టి బుధసన్నుతుఁ డున్నతుఁ డెన్న భాస్కరా!

శా॥ లోఁ రంజిల్లిన నాపదల్ తొలఁచుఁ దా లోకాభిరాముండు త
చ్ఛ్రీరాముండు. సమస్తసంపదలునుం జేకూర్చు. లోకత్రయా
ధారుం దద్భవదూరుఁ గూర్చి యసకృద్దండంబు లర్పించి పూ
ర్ణారోగ్యంబును బొందుకాలమది యత్యాసన్నమౌ భాస్కరా! ౨౬౩

మ॥ ఘనుఁడౌ రాముఁడు రాఘవుండు. రఘువో కాకుస్థుఁ డాసత్కకు
స్థుని దిక్ష్వాకునృపాలు నన్వయము. తత్క్షోణీధవాగ్ర్యుండు నీ
మనుమండౌ మను నాత్మజాతుఁ. డిటులన్ త్వత్పుత్రికాజాని త్వ
జ్జననంబందె జనించె. కాఁడు పరుఁ డెంచన్ నీకుఁదా భాస్కరా!

శా॥ ఎన్నం ద్వత్ప్రియతాన్వవాయభవుఁడౌటే కాక రాముండు సా
క్షాన్నారాయణుఁ డంబుజాసనమునం గ్రాలున్. భవన్మండలం
బు న్నిత్యంబు నలంకరించు. అతఁడే పో ధ్యేయుఁ డార్యాళి. కా
వెన్నన్ సన్నుతిసేయుచుంటి. నిడులే వే సౌఖ్యమున్ భాస్కరా!

ఉ॥ వేని యొడల్ హిరణ్మయము వేని మెడన్ మను హీరహారముల్
వేని శిరశ్శ్రివోంసముల వెల్గుఁ గిరీటసుకుండలాంగదాల్
వేని కరంబులన్ సతము వీడకయుండెడు శంఖచక్రముల్
వాని కనామయంబునిడ వందనము ల్సొనరింతు భాస్కరా! ౧౬౬

శా॥ కాఁడవ్వాఁడును యుష్మదన్యుఁ డరయుంగా. సూర్యనారాయణుం
డేడీ వాఁడు పరుండెనైన? అగు దీవే వాఁడు నవ్వాఁడె నీ.
వీ డెవ్వాఁడును గాఁడు నీకు రుజ మాయింపన్. కటాక్షించి నా
వాఁడే వీఁడని రోగశేషము శమింపజేయవే భాస్కరా! ౧౬౭

చం॥ ప్రజలను బూర్వజన్మకృతపాపమె యేచెడి వ్యాధియాపునన్.
ద్విజులకుఁ జేయు దానములు వేల్మి జపంబు సురార్చనంబు భే
షజములు దాని శాంతికగు సాధనముల్. భుజియించుచుంటి భే
షజము. సురార్చనంబు తగ సల్పుచునుంటి స్తుతించి భాస్కరా!

మ॥ పరకో పీసము నిల్చియున్నయది నా పాదంబునన్ నొప్పి. ఉ
ద్ధురమై వేఁడిమె పీడ దించుకయు. ఆదుర్వ్యాధియే మూల మీ
చరణవ్యాధికి. కాన నెట్లయినఁ దత్సంహారముం జేసి తే
సురుగుం బూర్తిగఁ గాలితీఁపు. బలముం దోఁ నబ్బెడిన్ భాస్కరా!

ఉ॥ దీనుఁడ. సూను లర్భకులు. దిక్కిఁక నెవ్వరు లేరు. ఉష్ణ ము
ష్ణేన ప్రశామ్య తేయనుట నిక్కము గాఁగల. దట్లుగాన నె
ట్లైనియు వేఁడివేల్పవగు నీవె సమస్తము చక్కఁగాఁగ నా
మేనఁగలట్టివేఁడిని శమింపఁగఁజేయఁగ నౌను భాస్కరా! ౧౭౦

చ॥ ఒలసెను వేఁడినుండి జిలయుం బ్రకృతంబు. భరింపఁజాల నా
గులగుల. గోకలేక నునుగోళ్ళును దోళ్ళగుచుండె. రేఁబవ
ళ్ళొలికెడి రక్తమంగములనుండి. శరీరము పుండ్లతోడ సం
కులమును నీరసంబు. కనుఁగొమ్మిటు నాదురవస్థ భాస్కరా! ౧౭౧

ఉ॥ ఈదురవస్థ నా యొకనికే యననేటికి? నాదు పత్నికిన్
గాదిలిబిడ్డ లందఱికిఁ గల్గెను. కాని యొకండు చెప్పె మీ
బాద దొలంగు కాలమది ప్రాప్తము కావున నీవిధంబుగన్
మీఁదికిఁబొంగె రోగమని. మిక్కిలి సంతసమయ్యె భాస్కరా!

శా॥ మూఢబ్రంబులనుండి నన్ గలఁచు పెన్వ్యాధంబు పోతంబులన్
కూడన్ నేఁడు సమాక్రమించినది. ఆకువ్యాధియే వేఁడి. తా
పాడైపోవనె యద్ది పొంగినదిపో పామాకృతిం బైకి. నీ
వేడన్ సైఁపఁగలేక యీవల కిటుల్ వెళ్ళంగనా భాస్కరా!
మ॥ అల వడ్డించుచునున్న వాఁడు తనవాఁడై యుండ నేబంతిలో
పలఁగూర్చుండిన నేమితక్కువ? జగద్బంధుండవైనట్టి నీ
అలఘుప్రేమను పూపయిం గలుగ మాయారోగ్య భాగ్యంబు ల
గ్గలమే యయ్యెడిఁగాని యున్నె కొద నిక్కంబారయన్ భాస్కరా!
మ॥ కృప యుత్పన్నము కానియంతవఱకే కీర్తించియో గొల్చియో
ఉపచారంబులు చేయఁగావలయు. నిం కుత్పన్న సౌహార్దులై
నపయిం గైతవ మాపచారికము. కానన్ సుప్రసన్నాత్మ నీ
ఉపచారంబులు కట్టిపెట్టుదును నేనుచ్చైఃకరా! భాస్కరా! ౨౭౫
ఉ॥ మిత్రుఁ డటంచు నిన్ శ్రుతియె మిక్కిలి పేర్కొనుచుండెఁగాన స
ర్వత్ర స్వమిత్రభావమును వారక చూపవె చూపుచుందు. వే
స్తోత్రముతోడి యక్కఱయు సుంత కనంబడ. దందు రోగయు
గ్గాత్రనిపట్ల మిత్రుఁ డధికంబుగఁజూపఁడె మైత్రి భాస్కరా! ౨౭౬
మ॥ అతి సర్వత్ర వివర్జనే త్తనెడి యద్యార్యోక్తి పాటించి యీ
స్తుతి సంపూర్ణము సేయుచుంటి. ఇఁక నా సూనుత్రయం బేను నా
సతి నీయగ్గము. మత్కుటుంబమునకున్ సంరక్షకుం డీవె. క
ల్గుత మారోగ్యము తీఱుతన్ వ్యధలు. శ్రీలుం గూడుతన్ భాస్కరా!
గద్య॥ ఇది శ్రీమ జ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్తోభయభాషా
పాండిత్య రసవత్కవిత్వనిధాన హారితసగోత్రోద్భవ
లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తా
యమాన విద్వత్సభావిష్కృతావధాన
విధాన జానపాటి పట్టాభిరామాభి
ధాన విలిఖితంబగు నారోగ్య
భాస్కరము.

---

చంద్రికా ముద్రాశాల – గుంటూరు.

శా॥ అస్మత్ప్రార్థననుండియో మఱి మదీయప్రార్థనంజేసియో
భస్మీభూతము సిక్కతీఁపు. కలిగెఁ భద్రింబు. కానీ జనుల్
సస్మేరాస్యులుగా నిఁ కేరుజయు నాసాన్నిధ్యముం జేరనీ
కస్మజ్జీవితశేషముఁ నడుపుమయ్యా సూర్యనారాయణా!

ఆ॥ షష్టిపూర్తియయ్యె. సప్తతి యాయువం.
టంతవఱకనామయుం బొసంగి
అప్పుసుతుల కొప్పఁజెప్పకయుండ నీ
లోనఁ జేర్చుకొనవె లోకమిత్రి!

---

## తప్పొప్పులపట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౨ | ౧౪ | జాడఉండనే | జూడఉండనే |
| 3 | ౨౦ | ఛాఅెడుఁగాదె | చాఁటెడుఁగాదె |
| ౬ | ౧౯ | పట్టల | పట్టుల |
| ౭ | ౮ | దిన్నగ | జిన్నగ |
| ౯ | ౬ | వ్రాయఁగ | చెప్పఁగ |
| ౧౦ | ౫ | వడవడి | వడివడి |
| | ౨౧ | జంఘువే | జంఘముఁ |
| ౧౧ | ౨౦ | గావి | గాని |
| ౧౨ | ౨ | నవెంతయు | నద్వెంతయు |
| | ౧౧ | దూరమేనియ | దూరమేనియు |
| | ౨౭ | లాగుడునకావల | లాగుడునకంటెను |
| ౧౭ | ౨౮ | యార్చినవాఁడు | యూర్చినవాఁడు |
| ౧౮ | ౨౫ | ప్రిస్తావంబున | ప్రసావ్రింబున |
| ౨౧ | ౨ | బిళ్లేలఁ | బిట్టేలఁ |
| | ౭ | ననర్హుఁడఁ | నశక్తుఁడఁ |
| ౨౨ | ౧౮ | నద్దు | సద్దు |
| | | పీఠికలో | |
| 2 | 22 | శేయస్కరము | శ్రేయస్కరము |
| 4 | 11 | మీకింతను | మీకింకను |
| 5 | 12 | పద్యపద్యమునం | పద్యమునం |
| 7 | 2 | నీఱగుచున్నది | నీరగుచున్నది |
| 8 | 16 | వాటిల | వాటిల్ల |

---

## —♦ హుతాశనస్తుతి ♦—

చం॥ అయినది భాస్కరస్తుతి. అనామయమిచ్చె నతం. డింక్ భవ
ద్దయ సముపార్జితవ్య. మది తద్ద ఘటించినఁగాని నేను తప్పా
పయి కరుదెంచుకార్యము శుభంబుగఁ దాఁబరిపూర్తిఁ జెంద. దా
రయవలె నాస్థితిక్ వృజినరాజినిషూదన! శ్రీహుతాశనా! ౧

ఉ॥ ఏటికొ తా సృజించె జగమీశ్వరుఁ డొక్కఁడనై వెలుంగక.
ల్లేటికొ బ్రహ్మ విష్ణువు మహేశ్వరుఁ డిందుఁడు సూర్యుఁ డగ్నినా
కోటికిదాఁటువేషము లకుంఠితశక్తిమెయిన్ ధరించె. ఈ
నాటకమంత వ్యర్థమని నామదిఁదోఁచెడిగా హుతాశనా! ౨

ఉ॥ వేసెను బెక్కువేషములు వేడ్కమెయిన్ మును తానె. లీలనై
వేసినవేషమిద్దియను వేత్తృతకుం బెడఁబాసె నెన్క. ఆ
యాసపడం గడంగ నిపు డక్కట! ఎందుకువచ్చు ఘోషము? బల్
మోసముసంభవించె. పడె మోహసముద్రమునన్ హుతాశనా! 3

ఉ॥ ఒక్కఁడు సూత్రధారుఁడు మఱొక్కఁడు రాజు ప్రధాని యొక్కఁడై
చక్క నటించుగాక. ఇది సాంఘికనాటకమం చెఱింగి తై
తక్కయటంచుఁ దక్కరులఁ దారె నటింపఁగఁజేయుచుండ్రిగా.
కక్కట! వారలందఱును నల్లెఱుఁగంగలరే హుతాశనా! ౪

ఉ॥ అట్టు లెఱుంగనట్టిరులయందున నేను నొకండఁగానఁ గ
న్పట్టఁగలేక తత్త్వమును బెండ్లము బిడ్డలటన్న భ్రాంతి ను
న్నట్టిఁడనై తదర్థముగ నర్థముగూర్ప యతించు చర్థనక్
దొట్టి వినీచకృత్యములఁ దుంచుడుకైతిఁగదే హుతాశనా! ౫

చం॥ ఇదివఱ కెన్నిజన్మముల నెత్తితినో యటఁ గానిచేఁత యె
య్యదియెది యాచరించితినొ యాదురితంబున కర్థహీనమా
ఉదవసితంబునం దుదయమొందితి. చెందితిఁ బెక్కుకష్టముల్.
తుదకు ఋణాలపాలయితి. త్రోవ యిఁ కెయ్యదొకో హుతాశనా!

చం॥ వసుధఁ గొమాళ్ళకెల్ల ఋణవత్పిత శత్రువటందు. రందులో
నిసుఁగులు మత్కుమారకులు. నేను ఋణంబును దీర్పకుండనే
అసువుల వీడినన్ ఋణదు లాకసిగందుల నాదునింటిలో
మసలఁగనీయ. రావిదపమాట వచింపఁగదే హుతాశనా! ౭

ఉ॥ నిన్నడుగం బనేమియన నీ కెనలారు హిరణ్యరేతుఁడం
చెన్నికగన్న యాహ్వయ. మిఁకేరికి లే దది. నేతిబీరకా
యన్నవిధంబుగాక యది సార్థకమై మనునట్లు నన్ను సం
పన్నునిజేయుఁడీవనుచుఁ బ్రశ్న మొనర్చితి నిన్ హుతాశనా! ౮

ఉ॥ వడ్డికినిచ్చి యొడ్డ యిలువాకిళు లగ్గముఁజేసికొందమన్
చెడ్డతలంపుతోడ నినుఁ జీటి నుతింపను. మత్కుటుంబ మే
యడ్డములేక యైహికము లన్నియు నొందుట కర్హవిత్త మే
ర్పడ్డ నదే ఘనంబనుచు భావనచేసెదఁ జూ హుతాశనా! ౯

ఉ॥ అప్పదితీర్పఁగావలయు నన్నిటికన్నను మున్ను. లేనిచో
ముప్పుఘటిల్లఁగాఁగలదు. మున్పటిమాన్యము ముంచకుంచు లే
ఇప్పుడు మాన్యమిచ్చినటు లెంతు. ఋణే శుచిమంచుఁ గృష్ణుఁడే
చెప్పఁడె పూర్వమందున శుచీ! కృతసర్వరుచీ! హుతాశనా! ౧౦

ఉ॥ ఆర్జితమే యలంతి భువి. అయ్యదికూడ ఫలింప దంతగా
ఊర్జితవృష్టిలేక. ధరయుం గడుఁ దగ్గ ఫలించుదాని. కీ
తీర్జతయయ్యె నొక్కొకను. దేశము నార్థికమైన దుస్థితిన్
జర్జరితం. బిఁకెవ్విధము సంస్కృతి నీఁదఁగలన్ హుతాశనా! ౧౧

ఉ॥ కాన ఫలింపఁజేతొ మహి. కల్గఁగఁజేసెదొ మేటి రాజస
న్మానము. నాదుపత్రికకు మంచిప్రచార మెసంగఁజేసెదో
దేనిని సల్పెదో నలిపి తీరిచి యప్పు కుటుంబరక్షకున్
న్యూనత లేకయుండునటు లోమఁగదయ్య ననున్ హుతాశనా! ౧౨

చం॥ ఎఱుఁగను నీచయాచనము నేఁ బ్రథమంబుననుండికూడ. ఆ
తెఱఁ గిపుడిప్డు పూనినను దీరదు నాదు మనోరథంబు. ఏ
నరపతియందొ చొచ్చి వెస నన్ ఫలితార్థుని జేయఁజూడవే
వరమదయాధనా! పతితపావనసంహననా! హుతాశనా! ౧౩

మ॥ ధనమిచ్ఛేత్తు హుతాశనాత్తను నుడిం దత్త్వజ్ఞులైనట్టి య
మ్మునివర్యుల్ లిఖియించియుండిరి. ధనమ్మున్ భక్తు లర్థింప నీ
యనిచో నేమిటి కిట్లు నాత్రియుదురు వా. రట్లౌట నీయర్థి నిన్
ధనయాచ్ఞం బొనరించె. తీర్పఁగదె నాదారిద్ర్య, మో పావకా!

గ్రంథకర్త.

---

